Published by : D. Siva Prasad
Dhyana Lahari Publications
# 525, R.R. Colony
Tirupati, A.P.
Ph : 08574 - 53184

" Tulasidalam "
Telugu

Brahmasri Subhash Patri

Editions :

I May 1995 Copies 1000
II Aug 1997 Copies 3000
III Dec 1999 Copies 3000
IV May 2001 Copies 1000
V Dec 2002 Copies 2000

Special Price : Rs. 49.99

Cover Design & Lay-out : Crystal Dot
DTP Lay-out : Omega Offset, Tirupati

Copies available at : All Pyramid Dhyana Kendras, A.P.
All branches of Vishalandhra Book House,
# 525, R.R. Colony
Tirupati, A.P.
Ph: 0877 - 2253184

Printed at : Om Art Print
Besent Road, Vijayawada.

ఈసారి యీ నా భౌతిక యాత్రకి
నేను ఎంచుకున్న తల్లి సావిత్రీదేవి ; తండ్రి రమణారావు ;
భౌతిక శరీర ధారణ చేసింది 1947 లో.

అయితే గత ఐదు జన్మల నుంచీ చేస్తున్నది
ఆధ్యాత్మిక జ్ఞాన విస్తరణే !
ఈసారి ఈ యాత్రకి కూడా కారణం అదే.
ఐతే, అదే యీ భూలోకానికి ఆఖరి చూపు.
ఉత్తరోత్తరా ఎన్నో ఊర్ధ్వలోకాలు !

ఈ ఆఖరి నాటకంలో
ఎంచుకున్న భార్య స్వర్ణమాల.
నన్నెంచుకుని వచ్చినవారు పరిణిత, పరిమళ.
ఇప్పుడందరూ యోగులే !

ఆధ్యాత్మికత పరిచయం 1976లో, మిత్రులు శ్రీ రామచెన్నారెడ్డి గారి ద్వారా.
గత జన్మల స్మృతులు మొదలైంది 1979 లో.
1981 నుంచి 1983 వరకు శ్రీ సదానంద యోగి పరిచయ, మరి సేవాభాగ్యం.
అప్పటి నుంచీ మొదలు ఉధృతంగా ఆధ్యాత్మిక ప్రచారం.
ఒకటే ధ్యేయం : అందరినీ యోగులుగా, జ్ఞానులుగా మలచటం ;
మరేదీ ‘ యోగ్య ’ మైనదిగా, ‘ జ్ఞానం ’ గా తోచలేదు !

1990 లో కర్నూలు పారిశ్రామికవేత్త శ్రీ B.V. రెడ్డి గారితో కలయిక. భాగ్యంగా
కర్నూలులో “ బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం ” యొక్క రూపకల్పన;
“ ది కర్నూలు స్పిరిచ్యువల్ సొసైటీ ” యొక్క అవతరణ.

1992 లో కోరమాండల్ ఉద్యోగ విరమణ. దరిమిలా అనంతపూర్ పట్టణ ప్రవేశం. వెంటనే అడ్వొకేట్ శ్రీ N.C. సంపత్‌కుమార్ గారితో స్నేహం. ఫలితంగా " పిరమిడ్ ధ్యాన కేంద్రం, అనంతపూర్ " ప్రారంభం.

1993 లో ప్రొద్దుటూరు, ఉరవకొండ, గుంతకల్ స్పిరిచ్యువల్ సొసైటీలు.

1994 లో తిరుపతి స్పిరిచ్యువల్ సొసైటీ ; కడప, ధర్మవరం, కదిరి, పీలేరు, బ్రాహ్మణపల్లి, రాయదుర్గం, హిందూపురం, ఆదోని మొదలైన ధ్యాన కేంద్రాలు.

1995 లో " స్వామి సదానంద ఆశ్రమం ", నందవరం ; పిరమిడ్ ధ్యాన కేంద్రం, తెనాలి.

1994 లో " BE A MASTER " పుస్తక రచన

1995 లో " తులసీదళం " పుస్తక రచన

ప్రస్తుత జీవనయాత్రలో విశేషాలు యింతవరకూ ఇవి !

నిరంతరం స్వాధ్యాయం ద్వారా జ్ఞానమయంగా,
నిరంతరం యోగమిత్రుల సహవాసంతో ఆనందమయంగా,
ప్రతి క్షణమూ అర్థవంతంగా ఉపయోగింపబడుతున్నది జీవితం.

ఇదీ నా స్వ పరిచయం !

కర్నూలు - సుభాష్ పత్రీ

జూలై, 1995

* * *

# " తదుపరి "

1996 లో నెల్లూరు, నరసరావుపేట, నాగలదిన్నె, గద్వాల మొదలైన స్పిరిచ్యువల్ సొసైటీలు, మరి 99% మౌనవ్రతం. " ఉరవకొండ పిరమిడ్ ధ్యానకేంద్రం " ప్రారంభం !

1997 లో విశాఖపట్టణం, ఎమ్మిగనూరు, విజయవాడ, శ్రీకాళహస్తి, రాయదుర్గం, బళ్ళారి, బెంగుళూరు, హాస్పెట్, సాంగ్లీ స్పిరిచ్యువల్ సొసైటీలు.

1997 లో అనేకానేక పిరమిడ్ పుస్తకాల, మ్యాగజైన్ల ప్రచురణ.

1998 లో భోపాల్, జైపూర్ (రాజస్థాన్), ఉజ్జయినీ, ముంబాయి, మైసూరు, రాయపూర్, ఆదోని, నంద్యాల, మదనపల్లి, కడప, ఎలమంచిలి, తాడిపత్రి, గుత్తి, నూజివీడు, జైపూర్ (ఒరిస్సా), పామర్రు, అల్వాల్, గుంటూరు, గుడివాడ, రాజమండ్రి, వరంగల్, అనకాపల్లి, శ్రీకాకుళం, విజయనగరం, పత్తికొండ స్పిరిచ్యువల్ సొసైటీలు.

1998 లో సుమారు 30 వరకు ద్వైమాసిక ధ్యాన పత్రికలు అనేకానేక ధ్యాన కేంద్రాల నుండి వెలువడడం !

1999 లో ఇంతవరకూ చిత్తూరు, వాయల్పాడు, కలిచెర్ల, గూడూరు, వెంకటగిరి, జగిత్యాల, ఖమ్మం, ఏలూరు, పలమనేరు మొదలైన పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీలు ; అహమ్మదాబాద్, కలకత్తా, న్యూఢిల్లీ, సూరత్, సింగపూర్, హాంగ్‌కాంగ్, మద్రాస్ లలో ధ్యాన తరగతులు !

- సుభాష్ పత్రి

హైదరాబాద్
మే, 1999

* * *

ఎంతోకాలం గా వాంఛిస్తున్న ఈ పుస్తక రూపకల్పన
సెప్టెంబర్ 1994న గుంతకల్ లో జరిగింది.

పుస్తక రూపకల్పన జరుగుతున్న సమయంలో ఎన్నో సమంజసమైన
మార్పులూ, చేర్పులూ చేసిన స్వర్గీయ డాక్టర్ V.V. బాలకృష్ణ, కర్నూలు,
వారికి నేనెంతైనా కృతజ్ఞుడను. డ్రాఫ్టుల తయారీలో అవిరామంగా
శ్రమించిన అనంతపూర్ మాస్టర్ P. రమణ ఎంతైనా అభినందనీయుడు.
పుస్తకం వ్రాయడానికి సరియైన వాతావరణం కల్పించినవారు
గుంతకల్ స్పిరిచ్యువల్ సొసైటీకి చెందిన మాస్టర్స్ శ్రీయుతులు
T. మురళీధర్, K. విజయకుమార్ మరి G. నరసింహయ్య గార్లు.

పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయం అందించినవారు
అనంతపూర్ పిరమిడ్ ధ్యాన కేంద్రం మాస్టర్స్ B.V. ప్రతాప్ రెడ్డి మరి
G. గుణాకర్ రెడ్డి గార్లు.

ఈ పుస్తకంలో ఉదహరింపబడిన ఉపనిషత్ శ్లోకాలు
రామకృష్ణ మిషన్ ప్రచురణల నుంచి,
బుద్ధ సూక్తులు డాక్టర్ రత్నాకరం బాలరాజు గారి ' ధమ్మపదం ' నుంచి
వేదమంత్రాలు, వాటి అర్థాలు, స్వామి దయానంద-పండిత గోపదేవ్
విరచిత ఆర్యసమాజ ప్రచురణల నుంచి, మరి
వేమన పద్యాలు బాల సరస్వతి బుక్ డిపో (కర్నూలు) వారి
' వేమన పద్య రత్నాకరము ' నుంచి సేకరించబడ్డాయి.

అలాగే ఇతర రచయితల, ఇతర గ్రంథాల నుంచి కూడా
ఎన్నో పద్యాలు, శ్లోకాలు, సూత్రాలు సేకరింపబడ్డాయి.

ఈ రచయితలు, మరి ప్రచురణకర్తలందరికీ కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని ఇంత సుందరంగా ముద్రించిన "సోమేశ్వర ప్రింటింగ్ ప్రెస్",
విజయవాడ, అధినేత అయిన శ్రీ B. ముఖర్జీ గారికి ప్రత్యేకంగా అభినందనలు.

కర్నూలు
జూలై, 1995

- సుభాష్ పత్రీ

ఆ రోజు 13, నవంబరు 1994.
తిరుపతి పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ సభ్యులతో కలసి తిరుపతి నుంచి
పీలేరు వెళ్తున్నాం -
పీలేరులో ధ్యానం క్లాసు ఇవ్వడం కోసం.

నాతోపాటు ఉన్నవారు మాస్టర్స్ మిట్టా శ్రీనివాసులు, కంచి రఘురామ్,
శేఖర్, మునుస్వామి, ఇంకా మేడమ్ ఉదయలక్ష్మిగార్లు.
బస్సులో ప్రయాణం చేస్తూ వుంటే భావతరంగిణి మొదలైంది -
మెదడు మరి ఊరికే కూర్చోదు కదా !

. . . .  . . . ప్రపంచంలో ఎన్నో మతాలు వున్నాయి.
కొందరు “ మాది అద్వైత మతం ;
జగన్మిథ్యా బ్రహ్మసత్యం, జీవో బ్రహ్మైవ ” అంటారు.
అందులోనూ కొందరు “ కంచీ మఠ పరంపర మాది ” అంటారు.
మరికొందరు “ కాదు, మాది శృంగేరీ సాంప్రదాయం ” అంటారు.
కొందరు “ మాది విశిష్టాద్వైత మతం ;
సగుణోపాసన మాకు ముఖ్యం ” అని వక్కాణిస్తారు.
కొంతమంది “ మేము శ్రీ వైష్ణవులం -
అన్ని మతాలలోనూ ఉత్కృష్టమైనది శ్రీ వైష్ణవ మతం -
అది ఆదివిష్ణువుకు సంబంధించినది -
మాది పూర్ణప్రపత్తి మార్గం ” అంటూ వుంటారు.

కొందరు “ మేము మాధ్వులం ”, “ జీవుడు వేరే, బ్రహ్మ వేరే ” అంటారు.
అందులోనూ కొందరు “ ‘ దక్షిణాది మఠం ’ వారం మేము ;
ఉడిపీ క్షేత్రం సర్వక్షేత్రాల లోనూ పవిత్రం ” అంటూ వుంటారు.
“ కాదు, కాదు ‘ ఉత్తరాది మఠం ’ పద్ధతే
అసలు సిసలైన మాధ్వ సాంప్రదాయం ” అని మరికొందరు.

కొంతమంది " మేము శ్రీ విద్యోపాసకులం ;
సకల చరాచర సృష్టి మొత్తం శ్రీ చక్రంలో నిబిడి వుంది కనుక,
తత్ ఉపాసన సర్వశ్రేష్ఠం " అని అంటూ ఉంటారు.

కొంతమంది " మాది అచల రాజయోగం;
మిగతావి దీనికి దిగదుడుపు " అని అంటారు ;
" చేయవలసింది ఏమీ లేదు. ఉన్నదంతా ఆ బట్టబయలే ;
మూలం లేని గుర్తెరిగే ఈ శరీరం ఏమీ కాదు " అని అంటూ వుంటారు.

కొంతమంది " మేము ఒరిజినల్ రోమన్ కాథలిక్కులం " అంటారు.
" కాదు, కాదు మేము ప్రొటెస్టంట్లమండీ " అని కొందరు.
" నిజానికి జీసస్ కన్నా మేరి మాతయే ముఖ్యం " అని మరి కొందరు.
కొంతమంది " మేము యూదుల మండి, పాత నిబంధన మాకు ప్రమాణం -
యెహోవా ఒక్కడే దేవుడు " అంటూ వుంటారు.

కొంతమంది " మేము జైనులం " అంటారు.
" అందులోనూ శ్వేతాంబరులమండీ " అని అంటారు.
" కాదు, కాదు శ్వేతాంబరం తక్కువ స్థితి, మేము దిగంబరులం " అని కొందరు.

మరి కొంతమంది " మాది వీర శైవ మతం ; మేము లింగాయతులం,
సర్వవేళలా లింగాన్ని ధరించడం మాకు తప్పనిసరి !
పరమశివుడు తప్పితే ఇతర తక్కువ దైవాలతో మాకు అవసరం లేదు " అంటారు.

కొంతమంది " మేము సిక్కులం ", " గురుగ్రంథపూజ మాకు శరణ్యం " అంటారు.
కొంతమంది " మాది ఇస్లామ్ ; అందులోనూ షియాలం " అని అంటారు.
" కాదు, కాదు మేము సున్నీలం " అంటారు మరి కొందరు.
" ఈ రెండూ కాదు, మేము అహ్మదీయులం " అని మరి కొందరు.

కొంతమంది, " మేము సుంకులమ్మ దేవతను కొలుస్తాంటాం ;
మాకు మా గ్రామదేవత తప్ప ఇంకేమీ అక్కరలేదు ;

జంతు బలి మాకు ముఖ్యం " అని వక్కాణిస్తారు.

కొంతమంది " మా ఇలవేలుపు వేంకటేశ్వరస్వామి ;
ఆయనే కలియుగ దైవం ; ఆయనే సర్వం ;
ఆర్చేవాడూ, తీర్చేవాడూ అన్నీ ఆయనే.
మా తలనీలాలు ఆయనకు సమర్పిస్తూ వుంటాం ; ప్రతిఫలంగా ఆయన
మా కోరికలన్నీ తీరుస్తూంటాడు " అంటూ వుంటారు.

కొంతమంది " మాది గాయత్రీ పరివార్ ;
' ఓం భూర్భువ ' మంత్రమే సర్వభాగ్యకారిణి " అంటూ వుంటారు.
కొంతమంది " మాది ఆర్యసమాజం ;
సత్యాలన్నీ వేదాలలోనే చెప్పబడి వున్నాయి.
వేదాలు మాత్రమే శ్రుతి ; వేదాలు మాత్రమే ప్రమాణం " అంటూ వుంటారు.

కొంతమంది " మాది మాస్టర్ C.V.V. యోగం ;
ఆయన మంత్రం జపించడం ద్వారా కుండలినీ జాగృతం అవుతుంది "
అంటూ వుంటారు.
కొంతమంది " మాది యోగోదా సత్సంగ్ సొసైటీ ;
' బాబాజీ ', ' లాహిరీ ', ' యుక్తేశ్వర్ ', ' యోగానంద ' గురుపరంపరే
మాకు పూజ్యనీయం " అంటారు.
కొంతమంది " మాది ట్రాన్సెన్‌డెంటల్ మెడిటేషన్ ;
నూతన తరహా అర్థశూన్య మంత్రాల ద్వారా భావాతీతస్థితిని పొందుతూ వుంట
మహర్షి మహేష్ యోగి మాకు మార్గదర్శకుడు " అని అంటారు.

కొంతమంది " మాది దత్త సాంప్రదాయం,
అవధూతస్థితి పరమ స్థితి ;
దత్త గురువులకు మేము శరణాగతి " అంటారు.
కొంతమంది " మాది భాగవత మతం,
' హరేరామ హరేకృష్ణ మహామంత్రం ' ను సర్వవేళలలో స్మరిస్తూ వుంటాం ;
అదే తారకం ; కృష్ణుడు ఒక్కడే పురుషోత్తముడు " అని అంటూ వుంటారు.

కొంతమంది " మేము నిరంకారులం ;
సత్యం తెలుసుకున్నాం, నిర్ అహంకారులం మేం ; నిర్గుణపూజ మాది " అంటారు.

కొంతమంది " మాది దివ్యజ్ఞాన సమాజం ;
మా గురువు శ్రీ స్వామి శివానంద ; మానవ సేవయే మాధవ సేవ ;
జపమూ, మంత్ర యోగమూ మాకు ముఖ్యం " అంటారు.

కొంతమంది " మేము అరవిందుల వారి మార్గాన్ని అనుష్ఠిస్తూ ఉంటాం.
అన్ని యోగాల సమన్వయం మాది.
సుప్రామైండ్‌ని భువి మీదకి అవతరింపజేయడం
మా లక్ష్యం " అంటూ వుంటారు.

కొందరు " మాది రామచంద్ర మిషన్ ;
మాకు ట్రాన్స్‌మిషన్ తప్పనిసరి ;
హృదయం మీద ధ్యానం చేస్తూ వుంటాం ; గురువే అన్నీ
చూసుకుంటాడు " అంటారు.

కొందరు " మాది సిద్ధయోగం ;
శ్రీ నిత్యానంద, శ్రీ ముక్తానంద గురుపరంపరకు చెందినవారం,
మాకు శక్తిపాతం శరణ్యం " అంటూ వుంటారు.
కొందరు " మాది ప్రేమతత్వం ; మేము ' మస్త్ ' లం ;
అవతార్ మెహర్‌బాబాయే మాకు పరమ ఆదర్శం " అంటూ వుంటారు.

కొందరు " రమణ మహర్షి చెప్పింది నూటి అయిన అద్వైతం ;
వారి పుస్తకాలు అత్యంత శ్రేష్ఠం ;
' నేనెవరు ? ' అని సదా విచారణ చేస్తూ వుంటాం " అని అంటారు.

కొంతమంది "మాది రామకృష్ణ మిషన్;

రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానందలు ఈ యుగపు మహాపురుషులు ;
ఉపనిషత్ సారమే సర్వం బోధిస్తుంది " అని అంటూ వుంటారు.

కొంతమంది " మాది రాధాస్వామి సత్సంగం ;
కృష్ణుడు ఒక్కడే ' స్వామి ', అంటే ' పరమాత్మ ' ;
మిగతా అందరూ ' రాధ 'లు అంటే ' జీవాత్మ ' లు " అని అంటారు.

మరికొంతమంది " మాది ఈశ్వరీయ బ్రహ్మకుమారీ సమాజం,
బ్రహ్మచర్యం తప్పనిసరి; ' బిందువు ' మీద ధ్యానం చేయాలి ;
' శివబాబా ' యే ఈ లోకానికి పరమగురువు " అని అంటారు.

మరి కొంతమంది " మేము జిడ్డు కృష్ణమూర్తిని ఫాలో అవుతాం ;
అన్నిటినీ ఇచ్ఛారహితంగా గమనిస్తూ వుంటాం ;
ఆయన పుస్తకాలు చదువుతూ ఉంటాం " అని అంటారు.

కొంతమంది " మేము షిరిడీసాయికి అంకితమయ్యాం ;
జన్మాంతం ఆయన భజన చేయడం మా కర్తవ్యం ;
సర్వ కష్టాలనూ దూరం చేసేవాడూ,
మోక్షం ప్రసాదించేవాడూ ఆయనే " అంటూ వుంటారు.

కొంతమంది ' మేము స్వామి అయ్యప్ప భక్తులం ;
జ్యోతిని చూసి తరిస్తూ వుంటాం ;
సంవత్సరాని కొకసారి శబరిమలై యాత్ర తప్పనిసరి " అంటూ వుంటారు.

ఈ విధంగా . . . . . . ఎంతో మంది . . . . . . ఎన్నో రకాలుగా . . . . . .
చక్కగా . . . . . చక్కచక్కగా . . . . . . .
వారి వారి మతాలను 'పూర్ణం'గా, 'పరిపూర్ణం'గా జీవించేస్తున్నారు !
అయితే,
ఇంతకీ,

మరి క్రొత్తగా పుట్టిన
ఈ " కర్నూలు స్పిరిచ్యువల్ సొసైటీ " వారు,
" తిరుపతి స్పిరిచ్యువల్ సొసైటీ " వారు,
" అనంతపురం పిరమిడ్ ధ్యాన కేంద్రం " వారు,
" గుంతకల్ స్పిరిచ్యువల్ సొసైటీ " వారు,
" ప్రొద్దుటూరు స్పిరిచ్యువల్ సొసైటీ " వారు,
" ఉరవకొండ స్పిరిచ్యువల్ సొసైటీ " వారు,
" ధర్మవరం స్పిరిచ్యువల్ సొసైటీ " వారు,
పీలేరు, చిత్తూరు, ఆదోని, కదిరి, హిందూపూర్, తెనాలి,
మొదలైన " పిరమిడ్ ధ్యానకేంద్రాల " వారు
ఇంకా . . . . . . . . . . . ఇంకా . . . . . . . . . . ఎంతోమంది . . . . . . .
వీరంతా మరి ఏ ' మతాని ' కి చెందినట్లు ?
ఏ సాంప్రదాయానికి ' అమ్ముడు ' పోయినట్లు ?

నిజానికి పై ఏ ఒక్క మతానికీ, అభిమతానికీ ప్రత్యేకంగా చెందరు వీరు !
అయితే అందరి నుంచీ, అందరి మంచీ నేర్చుకునేవాళ్ళు !
అంతేకాదు, వీరు తాముగా సత్యశోధనలో నిమగ్నులయినవారు !

అయినా " అసలు వీళ్ళ పూర్తి మతమేమిటి ?
వీళ్ళ పూర్ణతత్త్వమేమిటి ? . . . . . "
అని బుర్ర గోక్కుంటూ వుంటే ఒక్క మెఱుపు తళుక్కున మెరిసింది -
" వీళ్ళందరిదీ ' తులసీదళ ' మతం " అని !
అవును ! నిక్కచ్చిగా వీరందరిదీ " తులసీదళ " మతమే !

" తులసీదళ మతం " గురించి చెప్పాలంటే ముందుగా
ఒక చిక్కటి కథ చెప్పాలి . . . . . .

. . . . . .  ఒకానొక ఊళ్ళో ఒక స్త్రీ మూర్తి వుండింది.
ఆవిడకు ఉన్నట్లుండి ' పరమసత్యం ' మీద పరమ మోహం కలిగింది.
వెంటనే దానిని పొందాలని, " త్యాగమే దానికి మార్గం " అనుకుని,
తనకు ఇష్టాతియిష్టమైన వజ్రాలహారం మెడలోంచి తీసి త్రాసులో పడవేసింది.

ఊహూ . . . . . . . ఏమీ ప్రయోజనం కనిపించలేదు !
' పరమసత్యం ' కొంచెం కూడా చిటుక్కుమనలేదు !
' చాలదేమో ' అని తన సర్వాభరణాలనూ నిలువు దోపిడీ ఇచ్చింది -
అయినా ఏమీ కాలేదు !
ఇంట్లో ఉన్న వెండి, బంగారు పాత్ర లన్నింటినీ తీసుకొచ్చి వేసింది ;
షరా మామూలే !
' పరమసత్యం ' కనుచూపు మేరలో కనిపించలేదు !
అప్పడు గుర్తుకు వచ్చింది " ఒకటి మరచిపోయాను " అని ;
అదే, తనకు ప్రాణాతిప్రాణమైన మణి,
' శమంతకమణి ', ఇంకా మిగిలివుందని.

ఎంతో ఉత్సాహంతో దాన్ని తీసుకొచ్చి వేసింది.
ప్చ్ ! పాపం ! ఏమీ కాలేదు !
' పరమసత్యం ' అణుమాత్రమైనా కదలలేదు !
ఆ భామ కు చెమటలు పట్టాయి ;
పాపం,  ఇంకేమీ తోచక నిశ్చేష్టురాలైంది !

ఆ పరిస్థితిలో నెమ్మదిగా మరో తరుణీమణి విచ్చేసి,
చిరునవ్వు నవ్వుతూ, వయ్యారంగా ఒక తులసీదళాన్ని ' అలా ' ఉంచింది -
అంతే . . . . . .
' పరమసత్యం ' హఠాత్తుగా కదిలింది . . . . . . . !
' పరమసత్యం ' పూర్తిగా బట్టబయలైంది . . . . . . . !

. . . .  కనుక,

దేనివల్లనైతే పరమసత్యం వెంటనే గ్రాహ్యమవుతుందో,
వెంటనే దృగ్గోచరమవుతుందో, వెంటనే అనుభవానికి వస్తుందో,
. . . అదే . . . . . అదే,
" ' తులసీదళ ' మతం ".

" తులసీదళా " నికి ఒక చిన్ని కొమ్మ, రెండు ఆకులు వుంటాయి.
ఒక ఆకు పేరు " నీ వాస్తవాన్ని నీవే సృష్టించుకుంటున్నావు "
అన్న జ్ఞాన సూత్రం.
రెండవ ఆకు పేరు " ఆనాపానసతి - విపస్సన " అనే ధ్యాన సూత్రం.
మొదటి ఆకు " జ్ఞానాగ్ని " కి మూలం ;
రెండవ ఆకు " ధ్యానాగ్ని " కి నాంది.
మొదటిది మన ' జ్ఞాన చక్షువు ' ను పూర్ణంగా వికసింపచేసి,
' సేత్ ' * జ్ఞానం లాంటి పరిపూర్ణ విజ్ఞానాన్ని మనకు అందచేస్తుంది.
రెండవది మన ' దివ్యచక్షువు ' ను ఉత్తేజింపచేసి,
' బుద్ధత్వం ' అనే పరిపక్వమైన యోగ స్థితిని మనకు కలుగచేస్తుంది.
ఈ రెంటి కలయికే " తులసీదళ మతం ".

మొదటి ఆకు గురించి విపులంగా చెప్పాలంటే -
శ్రీకృష్ణుడి దగ్గరకు వెళ్ళాలి -
ఆయన ప్రకారం
" ఉద్ధరేదాత్మనాత్మానం, ఆత్మానమవసాదయేత్ ;
ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః "
అంటే,
" ఎవరూ ఇంకొకరికి ఏమీ చేయలేరు,
ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి.
ఎవరికి వారే బంధువులు ; ఎవరికి వారే శత్రువులు "
ఎవరికి వారే తమ తమ కష్టసుఖాలను సృష్టించుకుంటున్నారు.
అందరూ తమ తమ జనన-మరణ చక్రం లోపలా, బయటా,

అంటే, ఇహ, పరలోకాలలో స్వేచ్ఛగా విహరిస్తున్నవారే !
అందరూ,
ఏది కావాలంటే ఎప్పటికప్పడు, ఎక్కడి కక్కడ,
సమకూర్చుకోగల సర్వసమర్థత కలిగి వున్నవారే.
ఇదే పరమ సత్యం
ఇదే వికసిత జ్ఞానచక్షు పూర్ణ సారాంశం.

ఇక రెండవది, " ఆనాపానసతి-విపస్సన ".
" ఆనాపానసతి " అంటే, " ఉచ్ఛ్వాస నిశ్వాసలను గమనించడం "
అన్నమాట.
దీనివలన దృష్టి నాసికాగ్రంలో,
అంటే, భ్రూమధ్యంలో, తనంతట తాను సహజంగానే స్థితమవుతుంది.

క్రమక్రమంగా మూడోకన్ను తెరుచుకుంటుంది ;
దివ్యదృష్టి లభిస్తుంది.
దీనినే ' విపస్సన ' అంటాం.
క్రమక్రమంగా సూక్ష్మశరీరం విడివడుతుంది ;
ఇతర లోక సంచారం సంభవమవుతుంది.
వీటన్నిటి వలన ' పరమ సత్యం ' ప్రత్యక్షంగా గోచరమవుతుంది.
' ఆనాపానసతి-విపస్సన ' యే చేయవలసిన ఒక్కగానొక్క పరమక్రియ.
ఇది తప్ప చేయవలసింది మరొకటి ఏమీ లేదు.
మిగతావన్నీ అర్థరహితాలు !

. . . . " మూర్తి పూజ మెట్టు కాదు, అగడ్త " అన్నారు -
ఆర్యసమాజ స్థాపకులు స్వామి దయానంద సరస్వతి.
కరెక్ట్! బహు కరెక్ట్!! పరమ కరెక్ట్!!!
భజనలు తాత్కాలిక మానసిక ఆనందాన్ని మాత్రమే కలిగిస్తాయి.
దానికి మాత్రమే భజనలను ఉపయోగించుకుంటే ఫరవాలేదు.
అంతేకానీ పూజలూ, భజనలూ ' ముక్తిమార్గాలు ' కాలేవు.

స్తోత్రాలు మూర్ఖపు రాజకీయ నాయకులకు కావాలి.
వాటిని దైవాలు కోరుతారా? కోరేవారు ' దైవాలు ' అవుతారా ?

కేవల పారాయణాల వల్ల లాభం సున్న.
చేయవలసింది శాస్త్రీయ పంథాలో జ్ఞాన మథనం ; సరియైన తీవ్ర యోగ సాధన.
తీర్థయాత్రలు మాని యోగుల దగ్గరకూ, జ్ఞానుల దగ్గరకూ చేరాలి.
గుండ్లు కొట్టించుకోవడాలూ, కాషాయాలు ధరించడాలూ,
ముద్రలు వేసుకోవడాలూ, తిలకాలు దిద్దుకోవడాలూ,
విభూతి పూసుకోవడాలూ మొదలయినవన్నీ
తమ్ము తాము హీనపరచుకునే, కుంచింప చేసుకునే చర్యలే.

జపమాల త్రిప్పడం వల్ల, మంత్రోచ్చారణ వల్ల
అమూల్యమైన సమయం నిరుపయోగం అవుతుందే తప్ప
దుఃఖవిముక్తి ఎంత మాత్రం కలుగదు, నిర్వాణం ప్రాప్తించదు.
అమితంగా ఉపవాసాలు ఉండడం, పడిపడి గురు పాదపూజలు
చేయడం అన్నవి పూర్ణ మూర్ఖతలు.

సంసారం వదలి సన్యాసదీక్ష తీసుకోవడం
ధర్మానికీ, సత్యానికీ, ఆనందానికీ దూరంగా పోవడమే.

శుష్క తర్కవాదాలన్నవి, మతాభిమానాలన్నవి, మిడిమిడి జ్ఞానుల వ్యర్థవేదనలు.
యజ్ఞయాగాదుల వల్ల ధనసంపద నష్టం అవుతుందే కానీ,
జ్ఞాన నిష్ఠ కలుగదు . . . . . . . . . . . సత్యదర్శనం సంభవించదు !

కనుక,

ఇవన్నీ సంపూర్ణంగా త్యాజ్యనీయం.
సర్వ దేశ కాల పరిస్థితులలోనూ
గుర్తుంచుకోవలసిన
పరమసత్య మొక్కటే -
“ ఉద్ధరేదాత్మనాత్మాన ” మని ;
చేయవలసిన పరమక్రియ ఒక్కటే -
అదే, “ ఆనాపానసతి-విపస్సన ”.

ఇదే “ కర్నూలు స్పిరిచ్యువల్ సొసైటీ ” వారి,
“ తిరుపతి స్పిరిచ్యువల్ సొసైటీ ” వారి,
“ అనంతపురం పిరమిడ్ ధ్యాన కేంద్రం ” వారి,
“ గుంతకల్ స్పిరిచ్యువల్ సొసైటీ ” వారి,
“ ప్రొద్దుటూరు స్పిరిచ్యువల్ సొసైటీ ” వారి,
“ ఉరవకొండ స్పిరిచ్యువల్ సొసైటీ ” వారి,
“ ధర్మవరం స్పిరిచ్యువల్ సొసైటీ ” వారి,
‘ పీలేరు ’, ‘ చిత్తూరు ’, ‘ ఆదోని ’, ‘ కదిరి ’, ‘ హిందూపూర్ ’, ‘ తెనాలి ’,. . . .
మొదలైన ‘ పిరమిడ్ ధ్యానకేంద్రాలు ’ . . . . . .
ఇంకా . . . ఇంకా . . . మిగతా పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల వారి
పూర్తి మతం, పూర్ణతత్త్వం !
నిజానికి సృష్టి సమస్తంలో ఉన్నది ఒకే ఒక ఆధ్యాత్మిక శాస్త్రం;
వున్నది ఒకే ఒక స్పిరిచ్యువల్ సైన్స్
ఏ లోకంలో నైనా, ఏ కాలంలో నైనా . . . . . . !

. . . . . తుమ్మెద ప్రతి పువ్వు నుంచీ మకరందం గ్రోలినట్లు,
ప్రతి ఒక్కరి దగ్గరి నుంచీ మనం విధిగా జ్ఞానాన్ని సమీకరించుకోవాలి.
ప్రతి పువ్వులోనూ ఇంతో, అంతో మకరందం వుంటుంది ; అదే విధంగా
ప్రతి మనిషిలోనూ స్వల్పంగానో, అధికంగానో జ్ఞానం వుంటుంది.
కాబట్టి ఏ ఒక్కరినీ విస్మరించరాదు.
ప్రతి ఒక్కరి దగ్గర నుంచీ నేర్చుకోవాలి, తెలుసుకోవాలి.
[illegible] అనుభవించినదీ తక్షణం అందరికీ చెప్పాలి.

ఏ ఒక్కరినీ వదలరాదు.
తెలుసుకోవలసిన, తెలియచేయవలసిన ' పరమసత్య ' మొక్కటే !
చేయవలసిన, చేయించవలసిన ' పరమక్రియ ' ఒక్కటే !
ఇవే తులసీదళం లోని ' రెండు ఆకులు ' . . . . . . .

. . . . . ఈ విధంగా భావ పరంపర ముగిసింది.

. . . . వెంటనే ప్రక్కనే వున్న కంచి రఘురాం గారికి
" ఇప్పడే చక్కని భావన పుట్టింది " అని అంతా వివరించి,
" వెంటనే ప్రక్కవాళ్ళకు చెప్పండి " అన్నాను.
తరువాత " తులసీదళం " గురించి
ఆ రోజు పీలేరు ధ్యానం క్లాసు లోనూ,
మరుసటి రోజు అనంతపురం క్లాసు లోనూ,
మర్నాడు ఉరవకొండ లోనూ, గుంతకల్ లోనూ,
ఆ మర్నాడు కర్నూలు పిరమిడ్ ధ్యానకేంద్రం లోనూ,
అందరికీ చెప్పడం జరిగింది.

అందరూ ఈ భావన గురించి విని,
" మీరు వ్రాస్తున్న ' వన్ డే స్పిరిచ్చువల్ బ్రెయిన్ వాష్ ' అనే
పుస్తకానికి ఈ పేరే పెట్టండి " అన్నారు.
. . . . . అలా పుట్టింది ఈ "తులసీదళం".

" తులసీదళం " ఇప్పడు మీ చేతుల్లో వుంది ;
ఇంక మీ యిష్టం !

" యధా ఇచ్ఛసి తథా కురు ! "

కర్నూలు — సుభాష్ పత్రి
జూలై, 1995

* * *

## లోపల ...


| పేజీ నెం. | విషయం | పేజీ నెం. | విషయం |
|---|---|---|---|
| 1. | ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులు | 27. | ఓషో రజనీష్ |
| 2. | ఆధ్యాత్మిక శాస్త్రం | 28. | లోబ్‌సాంగ్ రాంపా |
| 3. | ఆధ్యాత్మిక శాస్త్ర విభాగాలు | 29. | రిచార్డ్ బాక్ |
| 4. | ధ్యానం | 30. | డాన్ యువాన్ |
| 5. | దివ్యజ్ఞానప్రకాశం | 31. | ముముక్షువు యొక్క శత్రువులు |
| 6. | నిత్యజాగ్రత | 32. | సేత్ |
| 7. | మనోశక్తి | 33. | లిండా గుడ్‌మాన్ |
| 8. | ధ్యానం వలన లాభాలు | 34. | జీసస్ (ఏసుక్రీస్తు) |
| 9. | కొన్ని ఆధ్యాత్మిక పరమ సత్యాలు | 35. | మహమ్మద్ |
| 10. | చైతన్యమే మూలం | 36. | జొరాస్టర్ |
| 11. | మెడిటేషన్ - 1 | 37. | జలాలుద్దీన్ రూమీ |
| 12. | మెడిటేషన్ - 2 | 38. | గోథే |
| 13. | యద్భావం తద్భవతి | 39. | కన్‌ఫ్యూషియస్ |
| 14. | ఏకైక సత్యం | 40. | ప్లేటో |
| 15. | జీవిత పరమార్థం | 41. | చువాంగ్ ట్జు |
| 16. | త్రివిధ ఆనందాలు | 42. | అన్నమయ్య |
| 17. | అంతిమ ధ్యేయాలు | 43. | గౌతమ బుద్ధుడు |
| 18. | రోజూ ఏం చేయాలి ? | 44. | నాలుగు ఆర్య సత్యాలు |
| 19. | అక్షరాభ్యాసం | 45. | అష్టాంగ మార్గం |
| 20. | తక్షణ కర్తవ్యం | 46. | సరియైన దృక్పథాలు |
| 21. | ప్రజల్ప రాహిత్యం | 47. | మధ్యే మార్గం |
| 22. | క్రియా యోగం | 48. | బ్రహ్మ విహారాలు |
| 23. | స్వాధ్యాయం | 49. | ధమ్మపదం లో |
| 24. | ఒక యోగి ఆత్మకథ | 50. | అత్తా హి అత్తనో నాథో |
| 25. | హిమాలయ యోగులు | 51. | బుద్ధుని ప్రకారం బ్రాహ్మణుడు |
| 26. | సంభోగం నుండి సమాధి | 52. | నారదుని సలహా |

| పేజీ నెం. | విషయం |
|---|---|
| 53. | మహదవధానం |
| 54. | తాపత్రయం |
| 55. | జ్ఞానాన్ ముక్తిః |
| 56. | పంచ వింశతి |
| 57. | తీర్థయాత్ర - తరించటం |
| 58. | తీర్థంకర గోత్ర బంధం |
| 59. | ధీరులు |
| 60. | మహావాక్యాలు |
| 61. | వృద్ధుడు |
| 62. | పునర్జన్మ |
| 63. | పండితుడు |
| 64. | సత్యమేవ జయతే |
| 65. | ఆత్మా దృశ్యతే సూక్ష్మదర్శిభిః |
| 66. | అయం లోకో నాస్తి పరః |
| 67. | శ్రేయస్సు - ప్రేయస్సు |
| 68. | ధ్యానం - మోక్షానందం |
| 69. | సూక్ష్మశరీర యానం |
| 70. | తస్మాత్ ! యోగీ భవ ! |
| 71. | బ్రహ్మజ్ఞానం - ఇంద్రియవశం |
| 72. | ధర్మం |
| 73. | ధర్మం - అధర్మం |
| 74. | ధర్మో రక్షతి రక్షితః |
| 75. | త్రయీ ధర్మం |
| 76. | చతుర్వర్ణాలు |
| 77. | తమో రజో సత్వ గుణాలు |
| 78. | నాలుగు యోగాలు |
| 79. | మూఢభక్తి |
| 80. | భక్తియోగం |

| పేజీ నెం. | విషయం |
|---|---|
| 81. | వర్ణాశ్రమ ధర్మం |
| 82. | సంసారం |
| 83. | సన్యాసం |
| 84. | గృహస్థాశ్రమం |
| 85. | బ్రహ్మచర్యం |
| 86. | కోరికలను అణచవద్దు ! |
| 87. | అధర్మయుక్తమైన కర్మలు ? |
| 88. | అయితే, స్వప్నావస్థలో ! |
| 89. | కర్మబద్ధుడు |
| 90. | నష్టో మోహః |
| 91. | మా గా మోహావేశం |
| 92. | కారణం - కార్యం |
| 93. | అదృష్టం |
| 94. | వసిష్ఠ గీతలో అదృష్టం |
| 95. | పురుష ప్రయత్నం |
| 96. | స్వేచ్ఛ - యాదృచ్ఛికం |
| 97. | పాపం-పుణ్యం-జ్ఞానం |
| 98. | వ్యాధులు |
| 99. | లలాట లిఖితం |
| 100. | అజ్ఞుడు -అల్పజ్ఞుడు - విజ్ఞుడు |
| 101. | ఆచార్యుడు |
| 102. | మనఃప్రలోభం - అంతరాత్మ ప్రభోధం |
| 103. | సూత్రప్రాయం - ప్రబంధప్రాయం |
| 104. | నిధి చాలా సుఖమా ? |
| 105. | సత్సంగం - సజ్జన సాంగత్యం |
| 106. | రాక్షసులు - మానవులు - దేవతలు |

| పేజీ నెం. | విషయం |
|---|---|
| 107. | జీవహింస |
| 108. | చేత - వ్రాత |
| 109. | యోగి |
| 110. | ఉత్తమ గురువులు |
| 111. | తనువు - ఆత్మ |
| 112. | చిరంజీవత్వం |
| 113. | ఏ న్యూనమూ లేదు ! |
| 114. | డూ ఆర్ డై ! |
| 115. | సరియైన నడవడిక |
| 116. | మాంసపిండం - మంత్రపిండం |
| 117. | ఆస్తికులు - నాస్తికులు |
| 118. | గురువు - లఘువు |
| 119. | ఆస్తికులలో నాలుగు వర్గాలు |
| 120. | మూఢభక్తుడు - శిష్యుడు |
| 121. | గురువు - పరమగురువు |
| 122. | నిర్వాణం తర్వాత ? |
| 123. | గురువులెప్పుడూ వున్నారు |
| 124. | సాధనా చతుష్టయం |
| 125. | వేదాంత ఘోష |
| 126. | యోగ సాధన |
| 127. | పతంజలి అష్టాంగ యోగం |
| 128. | యమ నియమాలు |
| 129. | చిత్తవృత్తి నిరోధం |
| 130. | ఆనాపానసతి |
| 131. | విపస్సన |
| 132. | ఉపాసన - విపస్సన |
| 133. | కుండలినీ జాగరణం |
| 134. | నాడీమండల శుద్ధి |

| పేజీ నెం. | విషయం |
|---|---|
| 135. | షట్చక్రాలు - సహస్రారం |
| 136. | దివ్యచక్షువు |
| 137. | సవికల్ప సమాధి |
| 138. | నిర్వికల్ప సమాధి |
| 139. | ఆత్మజ్ఞానం - బ్రహ్మజ్ఞానం |
| 140. | మాయ |
| 141. | మూడు అడుగులు |
| 142. | మూషిక వాహనుడు |
| 143. | ఆహారం - వ్యవహారం |
| 144. | ఆహార - వ్యవహారాలలో జాగ్రత వహించాలి |
| 145. | అశోక వనం |
| 146. | సవిరామ పరిశ్రమ |
| 147. | మేనకా ప్రయోగం |
| 148. | దత్తాత్రేయ |
| 149. | ఏడుకొండలవాడు |
| 150. | పుత్రుడు - పున్నామనరకం |
| 151. | చతుర్ముఖేన బ్రహ్మః |
| 152. | దుష్ట చతుష్టయం - నాలుగు యోగాలు |
| 153. | చిత్రగుప్తుడు |
| 154. | దర్పదః - దర్పహః |
| 155. | గరళకంఠుడు |
| 156. | త్రిపుర సుందరి |
| 157. | అహమేవ శరణం మమ |
| 158. | శేషశయనుడు |
| 159. | శివుడు - మూడో కన్ను |
| 160. | కృష్ణ |

| పేజీ నెం. | విషయం | పేజీ నెం. | విషయం |
|---|---|---|---|


161. దశరథుడు - అయోధ్య
162. ఇంద్రుడు - ఐరావతం - వజ్రాయుధం
163. కల్పతరువు - కామధేనువు - చింతామణి
164. గురూపదేశం - ఉపనయనం
165. బ్రాహ్మణులు - ద్విజత్వం
166. యజ్ఞోపవీతం
167. నిత్యాగ్నిహోత్రుడు
168. సంధ్యావందనం
169. అంశాత్మ - పూర్ణాత్మ
170. మానస పుత్రులు
171. చావు - నిద్ర - ధ్యానం
172. నిద్రావస్థ
173. భ్రోగి - భ్యోగి
174. గతం - అవగతం - విగతం
175. అప్పో దీపో భవ !

అనుబంధం - 1 181

- నా దారి ఎడారి
- నాస్తిక / ఆస్తిక మూర్ఖ అభిప్రాయాలు

# " ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులు "

ఎందరో మహానుభావులు - -

శివుడు,

హెర్మిస్,

కృష్ణుడు,

మహావతార్ బాబాజీ,

మహావీరుడు,

బుద్ధుడు,

లావో ట్జు,

జోరాస్టర్,

జీసస్,

మానీ,

మహమ్మద్,

మిలారెపా,

గురునానక్,

సేత్,

డాన్ యువాన్,

లోబ్‌సాంగ్ రాంపా,

ఓషో రజనీష్ - -

అందరికీ వందనములు !

ఇలా,

ఇంకా . . . ఇంకా . . . ఎందరో . . . .,

విశ్వవిఖ్యాతి గాంచిన వాళ్ళూ

మరి అంతగా ఎవరికీ తెలియని వాళ్ళూ,

అందరూ మహా యోగులే !

అందరూ గొప్ప ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులే !

అందరూ స్పిరిచ్యువల్ సైంటిస్టులే !

▲ **మనం కూడా పై వారిలా కావాలి.**

* * *

# " ఆధ్యాత్మిక శాస్త్రం "

అందరూ

తప్పనిసరిగా, విధిగా,

ప్రప్రథమంగా నేర్చుకోవలసిన శాస్త్రం ఒక్కటే.

అదే -

" ఆధ్యాత్మిక శాస్త్రం " ;

అంటే,

" స్పిరిచ్యువల్ సైన్స్ " -

Spiritual Science.

అంటే,

జీవిత సత్యాల గురించి చెప్పే శాస్త్రం.

అదే అన్నిటికీ మూలం.

▲ ఆధ్యాత్మిక శాస్త్రం అందరికీ తప్పనిసరి.

▲ మిగిలిన శాస్త్రాలూ, కళలూ, విద్యలూ అన్నీ ముఖ్యమే ;
అయితే, ఇవన్నీ ఆధ్యాత్మిక జ్ఞానం తరువాతే
సంపాదించుకోవలసినవి.

* * *

# " ఆధ్యాత్మిక శాస్త్ర విభాగాలు "

ఆధ్యాత్మిక శాస్త్ర పరిజ్ఞానంలో
నాలుగు మౌలిక విభాగాలు ఉన్నాయి :

| | | |
|---|---|---|
| ధ్యానం | - - - - | Meditation |
| దివ్యజ్ఞానప్రకాశం | - - - - | Enlightenment |
| నిత్యజాగ్రత | - - - - | Awareness |
| మనోశక్తి | - - - - | Thought Power |

▲ ధ్యానం ద్వారానే దివ్యజ్ఞానప్రకాశానికి మనం అర్హులమవుతాం.

▲ దివ్యజ్ఞానప్రకాశం వల్లనే మనలో నిత్యజాగ్రత అన్నది సుస్థిరమవుతుంది.

▲ ధ్యానం, దివ్యజ్ఞానప్రకాశం, నిత్యజాగ్రత -
ఈ మూడింటి వల్లనే మన మనోశక్తి అన్నది ప్రబలమవుతుంది.

▲ ప్రబలమైన మనోశక్తి ద్వారా సాధించలేనిది ఏదీ - ఏ లోకంలోనైనా,
ఏ కాలంలోనైనా - ఉండనే ఉండదు.

* * *

# " ధ్యానం "

ధీ + యానం = ధ్యానం
" ధీ " = " సూక్ష్మశరీరాది సముదాయం "
అంటే, " ఆస్ట్రల్‌బాడీ కాంప్లెక్స్ " అన్నమాట.
" యానం " = " ప్రయాణం "

కనుక,

" ధ్యానం " అంటే,
" సూక్ష్మశరీరాది సముదాయంతో చేసే ప్రయాణం "
అన్నమాట ;
దీనినే "ఆస్ట్రల్ ట్రావెల్" అంటాం.

▲ ధ్యానం ద్వారానే సర్వలోకాలూ తిరగగలుగుతాం.
▲ ధ్యానం ద్వారానే సర్వలోకవాసులనూ కలుసుకోగలుగుతాం.
▲ ధ్యానం ద్వారానే సర్వలోక రహస్యాలనూ తెలుసుకోగలుగుతాం.
▲ ధ్యానం ద్వారానే సర్వలోక ఆనందాలూ పొందగలుగుతాం.

* * *

# " దివ్యజ్ఞానప్రకాశం "

" మనం ఏమిటి ? "

" మనం ఎవరం ? "

" ఎక్కడి నుండి వచ్చాం ? "

" ఎక్కడికి పోతున్నాం ? "

" ఎందు కోసం పుట్టాం ? "

" చనిపోయిన తరువాత ఏమౌతుంది ? "

" అసలు, ' సంఘటన 'లు ఎలా జరుగుతున్నాయి ? "

" ఈ జనన-మరణ చక్ర పరమార్థం ఏమిటి ? "

" 'దైవం' అంటే ఏమిటి ? "

" ఈ అద్భుత సృష్టిక్రమం అంతా ఎలా సాగుతోంది ? " -

-ఈలాంటి ప్రశ్నలన్నింటికీ
పరిపూర్ణమైన సమాధానాలు స్వానుభవంతో తెలుసుకుని
తదనుగుణంగా జీవించటమే " దివ్యజ్ఞానప్రకాశం కలిగివుండడం " అంటే!

▲ ధ్యానం ద్వారా ప్రత్యక్షంగా -
మరి ధ్యానుల అనుభవాలు వినడం ద్వారా,
ధ్యానుల పుస్తకాలు చదవడం ద్వారా పరోక్షంగా -
అందరికీ పరిపూర్ణ దివ్యజ్ఞానప్రకాశం అనతికాలంలో కలుగుతుంది.

* * *

# " నిత్యజాగ్రత "

" నిత్యజాగ్రత "
అనేది ధ్యానం ద్వారానే,
దివ్యజ్ఞానప్రకాశం ద్వారానే,
మనకు లభ్యమయ్యే స్థితి.

ఈ స్థితిలో " సదా మెళకువ "తో
వుండడం జరుగుతూ ఉంటుంది.
ఎప్పుడూ " వర్తమాన స్ఫూర్తి "ని కలిగి వుంటాం.
భూత భవిష్యత్ కాలాల ఛాయలు వర్తమానం మీద
కావాలంటేనే పడతాయి ; అనుకుంటేనే వుంటాయి.

ఒకానొక ఆధ్యాత్మిక శాస్త్ర విద్యార్థి,
ధ్యానంలో నిష్ణాతుడైన తరువాత,
దివ్యజ్ఞానప్రకాశం కలిగిన తరువాత,
పూర్ణ ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞుడైన తరువాత,
నిరంతరం అభ్యాసం చేయవలసిన స్థితే
" నిత్యజాగ్రత (Awareness) ".

మన " లోపలి " పరిస్థితులు కానీ, మన " బయటి " పరిస్థితులు కానీ,
క్షణక్షణం రూపాంతరం చెందుతూనే ఉంటాయి.
ఏదీ స్థిరమైనది కాదు, ప్రతీదీ తాత్కాలికమే ;
ప్రతీదీ చైతన్యవంతమే, ప్రతీదీ రూపుమారేదే.

▲ **నిరంతరంగా మారే లోకంలో, ప్రస్తుత సందర్భాన్నీ ,**
**ప్రస్తుత సమస్యనూ గుర్తించి దానికి అనుగుణంగా ప్రతిక్షణమూ**
**జాగరూకతతో మెలగడమే నిత్యజాగ్రత స్థితి .**

* * *

# " మనోశక్తి "

" మనకున్న శక్తి అనంతం "
అని తెలుసుకుని దానిని సదా ఉపయోగించుకోవాలి !
మనం ఏది అనుకుంటే అది జరిగి తీరాలి !

అయితే,

" మనోశక్తి "
అన్నది
ధ్యానం ద్వారానే,
దివ్యజ్ఞానప్రకాశం ద్వారానే,
నిత్యజాగ్రత ద్వారానే తప్ప,
మరే పద్ధతిలోనూ వుత్పత్తి కాజాలదు; ప్రబలం కాలేదు.

▲ పరిణతి చెందిన " పూర్ణాత్మలు (Overselves) "
అంటే " సహసృష్టికర్తలు (Co-Creators) "
ప్రబలమైన తమ మనోశక్తి ద్వారానే నూతన అంశాత్మల సృష్టి,
మరి ప్రత్యేక లోకాల సృష్టి చేస్తూ వున్నారు.

* * *

# " ధ్యానం వలన లాభాలు "

ధ్యానం ద్వారా
మనకు ఆరు విధాల లాభాలు చేకూరుతాయి :

అవి ,

1) శారీరక ధార్ఢ్యం
2) మానసిక ప్రశాంతి
3. బుద్ధి సునిశిత
4) ఆర్థిక సంక్షేమం
5) సుమిత్ర ప్రాప్తి
6) ఆధ్యాత్మిక విజ్ఞానం

" ధ్యానయోగం " అన్నది తెలియని వారికి
ఆధ్యాత్మిక సత్యాలు దృగ్గోచరం కావడం అన్నది అసంభవం ;
కనుక, వారు అనేక విధాల ప్రమత్తులై వుంటారు.
పర్యవసానం -
ఏ విధమైన స్వస్థతా వాస్తవానికి వారికి వుండదు.

▲ ధ్యానులు కాని వారికి శారీరక దుర్బలత , మానసిక అశాంతి , ఆధ్యాత్మిక అజ్ఞానం అన్నవి తప్పవు .

▲ ధ్యానులు కానివారికి ' సుమిత్ర శూన్యత ', అంటే ' సంఘంలో మంచి మిత్రులు లేకపోవడం ' అన్నది వుంటుంది .

▲ ధ్యానులు కాని వారికి " ఆధ్యాత్మిక అజ్ఞానం ", అంటే "మనం ఎవరమో, ఎందుకు జీవిస్తున్నామో అన్నవి బొత్తిగా తెలియకపోవడం ", అన్నది తప్పదు.

* * *

## " కొన్ని ఆధ్యాత్మిక సత్యాలు "

- సృష్టిలో కోటానుకోట్ల లోకాలు ఉన్నాయి.

- మనకు ఎన్నో దేహాలు ఉన్నాయి.

- మూలచైతన్యం నుంచి ' వర్షం 'లా ఎప్పుడూ ఆత్మల సృష్టి జరుగుతూనే వుంది, వుంటుంది.

- పూర్ణాత్మలు అంటే పరిణితి చెందిన ఆత్మలు,
  కూడా తమలోంచి నూతన అంశాత్మలను
  సృష్టిస్తూ వుండడం జరుగుతూ వుంటుంది.

- మూలచైతన్య ఆత్మలు కానీ, పూర్ణాత్మల నుంచి
  వచ్చిన అంశాత్మలు కానీ, అన్నీ - రకరకాల అనుభవాలను
  జనన - మరణ చక్రంలో కానీ, దాని బయట కానీ -
  విధిగా సంపాదించుకోవాలి;
  శిశు ఆత్మలన్నీ విధిగా పరిణామ క్రమంలో పూర్ణపరిణితి చెందాల్సిందే.

- అన్ని ఆత్మలకూ ఎప్పుడూ పూర్తి స్వేచ్ఛ వుంటుంది.

- తమ తమ ఇచ్ఛా స్వేచ్ఛ వల్ల రకరకాల కర్మలను చేస్తూ, చేస్తూ,
  వాటి వాటి ఫలితాలను అనుభవిస్తూ, అనుభవిస్తూ ఎన్నో
  పాఠాలను నేర్చుకుంటూ, నేర్చుకుంటూ ఉండడం అన్నది సదా
  జరుగుతూ, జరుగుతూ ఉంటుంది.

▲ . . . . . ఇటువంటి సత్యాలు ఇంకా, ఇంకా ఎన్నో వున్నాయి.
అన్నీ ఎప్పటికప్పుడు, ఎక్కడికక్కడ తెలుసుకుంటూ వుండాలి.

* * *

# " చైతన్యమే మూలం "

చైతన్యం

(Consciousness)

↓

చైతన్య శకలాలు

(Units of Consciousness)

↙ ↘

| ప్రాణశక్తి శకలాలు | చైతన్య శకలాలు |
|---|---|
| (Electro-Magnetic) Energy Units) | (Consciousness-Units) |
| ↓ | ↓ |
| పదార్థం (Matter) | దేహి (Entity) |

↘ ↙

సజీవ దేహాలు

(Embodied Entities)

- సృష్టికి మూలాధారమే " మూలచైతన్యం ".
- మనం ఈ " మూలచైతన్యం " యొక్క శకలాలం.
- కొన్ని చైతన్య శకలాలు " ప్రాణశక్తి శకలాలు " గా రూపాంతరం చెందుతాయి.
- ఈ ప్రాణశక్తి శకలాల సముదాయమే " మూలప్రకృతి ".
- ఈ మూలప్రకృతే క్రమక్రమంగా " స్థూలప్రకృతి " గా అంటే- పాంచభౌతికంగా రూపాంతరం చెందుతూ వుంటుంది.

▲ పాంచభౌతిక పదార్థ పరిణామక్రమంలో ' దేహాల ' ఉత్పత్తి జరిగినప్పుడు మూల చైతన్య శకలాలు ' దేహి ' గా రంగ ప్రవేశం చేస్తాయి.

“ మెడిటేషన్ ” అనే పదం
ఎన్నో విశేషాలను చెప్తుంది.

| | | |
|---|---|---|
| M | Meditation | ధ్యానం |
| E | Energy-Conservation | శక్తిని కూడగట్టుకోవడం |
| D | Detachment | నిస్సంగం |
| I | Intent | దీక్ష, ఏకాగ్రత |
| T | Third Eye | దివ్యచక్షువు |
| A | Astral Travel | సూక్ష్మశరీర యానం |
| T | Thought Power | మనోశక్తి |
| I | Intellect | బుద్ధికుశలత |
| O | Overself Contact | పూర్ణాత్మ జ్ఞానం |
| N | Nirvana | దుఃఖరాహిత్యం, ముక్తి, మోక్షం |

M-E-D-I = “ మెడి ” = అనేవి చేయవలసినవి - INPUTS ( ఇన్‌పుట్స్ )
T-A-T-I-O-N = “ టేషన్ ” = అనేవి పొందబడేవి - OUTPUTS (అవుట్‌పుట్స్ )

( డాక్టర్ G. యుగంధర్,
కర్నూలు స్పిరిచ్యువల్ సొసైటీ, వారి
ధ్యాన సందేశం )

▲ **చేయవలసినవి చేస్తే పొందగలిగేవి ‘ ఆటోమాటిక్ ’ గా పొందుతాం.**

* * *

# " M.E.D.I.T.A.T.I.O.N. - II "

| | | |
|---|---|---|
| M | - Mind | మైండ్ |
| E | - Eternally | ఇటర్నల్లీ |
| D | - Directed | డైరెక్టెడ్ |
| I | - In | ఇన్ |
| T | - Tuning | ట్యూనింగ్ |
| A | - And | అండ్ |
| T | - Taming | టేమింగ్ |
| I | - In | ఇన్ |
| O | - Only | ఓన్లీ |
| N | - Nirvana | నిర్వాణ |

▲ అందువల్ల,
బుద్ధిని నిర్వాణం వైపు మాత్రమే శాశ్వతంగా మరల్చి,
అందులోనే శృతిచేసి వుంచండి; అందులోనే సదా
మనుగడ సాగించడమే ' ధ్యానం ' అంటే.

( N.C. సంపత్‌కుమార్
పిరమిడ్ ధ్యానకేంద్రం, అనంతపురం, వారు
శ్రీ గణపతి మాస్టర్ ద్వారా పొందిన ధ్యాన సందేశం )

* * *

# " యద్భావం తద్భవతి "

ఎప్పుడూ,

మన భావనా ధోరణే మన భౌతిక వాస్తవంగా మారుతుంది!

కనుక

మనకు మన

| | | |
|---|---|---|
| వినాశకర ధోరణి (Disastrous Thinking) | వలన | వినాశకర ఫలితాలు (Disastrous Results) |
| నిరాశాజనక ధోరణి (Negative Thinking) | వలన | విపరీత ఫలితాలు (Negative Results) |
| ఆశాజనక ధోరణి (Positive Thinking) | వలన | సత్ ఫలితాలు (Positive Results) |
| అద్భుతకర ధోరణి (Miraculous Thinking) | వలన | అద్భుత ఫలితాలు (Miraculous Results) |

లభిస్తాయి.

▲ " తీవ్రంగా వాంఛించినదీ, త్రికరణశుద్ధితో నమ్మినదీ,
నిశితంగా యోచన చేసినదీ, ఉత్సాహంతో ప్రయత్నం చేసినదీ,
ఏదైనా సరే, అది తప్పనిసరిగా అయి తీరుతుంది . "

= సైబిల్ లీక్ యొక్క మాతామహి

* * *

“ మన వాస్తవాన్ని మనమే సృష్టించుకుంటున్నాం ” -
ఇదే ఏకైక సత్యం.

“ ఉద్ధరేదాత్మనాత్మానం, ఆత్మానమవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవరిపురాత్మనః ”

అంటున్నది భగవద్గీత.

“ మనలను మనమే ఉద్ధరించుకోవాలి ;
అంతేకానీ, మనలను మనం పతనం చేసుకోరాదు.
మనకు మనమే బంధువులం ;
మనకు మనమే శత్రువులం .”

అంతేకానీ,
మరెవ్వరూ మనకు సహాయం చేయలేరు.
మరెవ్వరూ మనకు హాని చేయలేరు.

▲ **మన తీవ్ర పురోగతికి కానీ , మన మంద పురోగతికి కానీ , లేక మన తిరోగతికి కానీ సదా మనమే కారకులం .**

* * *

# “ జీవిత పరమార్థం ”

ఈ

జీవితం

వున్నది - -

అన్ని వస్తువులనూ, అన్ని విషయాలనూ అనుభవించడానికి !

సకల కళలనూ, సకల విద్యలనూ అభ్యసించడానికి !

ఆధ్యాత్మిక శాస్త్రం గురించి పూర్తిగా, క్షుణ్ణంగా తెలుసుకునేందుకు !

ముఖ్యంగా ఆత్మశక్తులను శక్తిమేరకు సంతరించుకునేందుకు !

కనుక,

జీవిత పరమార్థాలు - నాలుగు :

▲ భుక్తి --- విషయానందం ద్వారా

▲ రక్తి --- కళలు, ఆటలు, పాటలు ద్వారా

▲ ముక్తి --- ఆధ్యాత్మిక విజ్ఞానం ద్వారా

▲ శక్తి --- యోగ సాధన ద్వారా

* * *

మూడు రకాల
ఆనందాలు ఉన్నాయి . . .

అవి . . .

1) విషయానందం
2) భజనానందం
3) బ్రహ్మానందం

మన జీవితం
ఉన్నది - -

▲ అన్నమయకోశం ద్వారా విషయానందం పొందడం కోసం
▲ మనోమయకోశం ద్వారా భజనానందం పొందడం కోసం .
▲ విజ్ఞానమయ, ఆనందమయకోశాల ద్వారా బ్రహ్మానందం పొందడం కోసం .

* * *

# " అంతిమ ధ్యేయాలు "

మనం
" త్రికాల జ్ఞానులం అవ్వాలి " -
మనం " త్రిలోక సంచారులం అవ్వాలి " -
" ఈ మాంసపిండాన్ని మంత్రపిండం చేయాలి " -

ఇవే,
ప్రతి వ్యక్తి జీవితం యొక్క అంతిమ ధ్యేయాలు.
ఇవన్నీ జన్మ పరంపరలో సుసాధ్యాలు.

ఏ జన్మలో ఈ అంతిమ ధ్యేయాలను
సాధించడానికి పూనుకుంటామో,
ఆ జన్మ " ఆఖరి జన్మ " అయి తీరుతుంది.

" యద్భావం తద్భవతి "
" యా మతిః సా గతిర్భవేత్ "

అంటే,
" మన ' మతి ' ఎలా వుంటుందో మన ' గతి ' కూడా అలాగే వుంటుంది ".
మన ' మతి ' లో ఈ ధ్యేయాలు పెట్టుకుని
దీక్షతో సాధన కొనసాగిస్తే మన ' గతి ' కూడా తప్పకుండా అలాగే
వుంటుంది.

▲ అంతిమ ధ్యేయాలే లక్ష్యాలుగా పెట్టుకుందాం.
▲ ఈ జన్మను ఆఖరు జన్మగా చేసుకుందాం.

* * *

## " రోజూ 'తప్పనిసరిగా' ఏం చేయాలి? "

రోజూ

' తప్పనిసరిగా '

కనీసం ,

- ▲ ఒక గంట -- ధ్యానం
- ▲ ఒక గంట -- స్వాధ్యాయం
- ▲ ఒక గంట -- సజ్జన సాంగత్యం

చేసి తీరాలి.

▲ మిగతా సమయంలో ,

సంతోషంగా ఉంటూ , సదా , అన్ని కోణాలలోనూ , జీవితాన్ని అనుభవించాలి !

**" B.H.E.L."**
**" Be Happy and Enjoy Life "**

* * *

# " అక్షరాభ్యాసం "

అ + క్షరం = అక్షరం

" క్షరం " కానిది " అక్షరం ".

" క్షరం " అంటే " నశించేది ".

" అక్షరం " అంటే " నశించనిది " అని అర్థం.

" చైతన్యం " అంటే "Consciousness";

చైతన్యం అన్నది అక్షరం; అది నశించని వస్తువు.

" మనం చేతనామయ ఆత్మలం " -

అన్న సత్యాన్ని

ఎప్పుడూ అభ్యాసంలో వుంచడమే

నిజమైన " అక్షరాభ్యాసం " అన్నమాట.

- ▲ ధ్యానం చేయడమే ' అక్షరాభ్యాసం ' చేసుకోవడం అంటే.
- ▲ ఆత్మజ్ఞాన సముపార్జనే ' అక్షరాభ్యాసం '.
- ▲ మనం పుట్టిందే ' అక్షరాభ్యాసం ' కోసం.
- ▲ ' అక్షరాభ్యాసం ' పూర్తి అయ్యేవరకు,
  " పునరపి జననం, పునరపి మరణం " అన్నది తప్పదు.

* * *

## " తక్షణ కర్తవ్యం "

తత్ + క్షణం = తక్షణం
" తక్షణం " అంటే " ప్రస్తుత క్షణం " అన్నమాట.
" కర్తవ్యం " అంటే " అనివార్యంగా చేయవలసినది ".

ప్రతి క్షణంలోనూ " చేయగలిగినవి " ఎప్పుడూ ఎన్నో వుంటాయి.
కానీ, " చేయవలసింది " వాటిల్లో ఎప్పుడూ ఒక్కటే!
చేయగలిగిన వాటిలో అనివార్యంగా చేయవలసిన దానిని గుర్తించి
ఆ పనిలో సంపూర్ణంగా నిమగ్నం అవుతున్నవాడే సరియైన కర్తవ్యనిష్టుడు.

" తక్షణ కర్తవ్య " మంటే -
" ఈ ప్రస్తుత క్షణంలో చేయవలసిన పని " అన్నమాట.
మన, మరి ఇతరుల మానసిక పరిస్థితులు కానీ,
బయటి వాతావరణ పరిస్థితులు కానీ,
క్షణక్షణం రూపాంతరం చెందుతూనే వుంటాయి ;
అలా రూపాంతరం చెందుతూ వుండే ప్రతిక్షణం లోనూ,
ప్రతి పరిస్థితిలోనూ, తగిన కర్తవ్యనిష్టను కలిగి వుండాలి.

" నడిచేటప్పుడు నడవాలి, తింటున్నప్పుడు తినాలి " అని ఓ సందర్భంలో
బుద్ధుడు చెప్పాడు.
అంటే, చేతిలో వున్న పనిని వదలి మనస్సు ఒక్క క్షణమైనా
' పరధ్యాస 'లో వుండరాదు.

▲ దివ్యజ్ఞానప్రకాశం ద్వారానే మన ' వర్తమాన-ధ్యాస ' స్థితమవ్వుతుంది.
▲ ' పరధ్యాస ' రహిత స్థితే ' వర్తమాన-ధ్యాస ' స్థితి.
▲ వర్తమాన-ధ్యాస వున్నవాడే నిత్యజాగరూకుడు.
▲ నిత్యజాగరూకుడే తక్షణ కర్తవ్య నిష్టుడు కాగలడు.
▲ తక్షణ కర్తవ్య నిష్టుడే అద్భుత ప్రగతిని సాధించగలడు.

* * *

# " ప్రజల్ప రాహిత్యం "

మనిషి
శారీరకంగా కానీ,
మానసికంగా కానీ,
ఆధ్యాత్మికంగా కానీ,
హీన స్థితి నుంచి ఉన్నత స్థితికి పోవాలంటే
కావలసిన తప్పనిసరి గుణమే " ప్రజల్ప రాహిత్యం !"

" ప్రజల్పం "
అంటే
" అసందర్భపు ప్రేలాపన ",
" పనికిరాని మాటలు మాటలాడటం " అన్నమాట.

ప్రజల్పం అన్నదానిని కట్టిపెట్టాలి.
ప్రజల్పమే మనిషిని తినివేసే కాన్సర్ వ్యాధి !
నోట్లోంచి ఒక్క అనవసరపు మాట కూడా రాకూడదు !
అప్పుడు బోలెడంత శక్తిని
మనలో కూడగట్టుకోవడం జరుగుతుంది.
" ప్రజల్ప రాహిత్యం " అంటే " శక్తిని పొదుపు చేయడం " అన్నమాట.
ఆ శక్తే మన శారీరక, మానసిక,
ఆధ్యాత్మిక శుద్ధతకూ, వికాసానికీ, పరాకాష్టకూ క్రమక్రమంగా
దోహదపడుతుంది.

- **ప్రజల్ప సహితుడు ఎప్పుడూ నిర్వీర్యుడే.**
- **ప్రజల్ప రహితుడు ఎప్పుడూ వీర్యుడే.**
- **భోగకామికి కానీ, మోక్షకామికి కానీ, ప్రజల్ప రాహిత్యం అన్నది అనివార్యం.**

* * *

" క్రియ " అంటే " చేయవలసినది ".

" యోగం " అంటే " సాధన ".

కనుక, " క్రియా యోగం " అంటే

" చేయవలసిన సాధన ".

" తపః స్వాధ్యాయ ఈశ్వరప్రణిధానేన క్రియాయోగః " -

ఇది పతంజలి మహర్షి చెప్పిన యోగ సూత్రాలలో ఒకటి.

తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం -

అనబడే మూడు ప్రక్రియలూ కలిసి

" క్రియా యోగం " అవుతుంది.

కనుక,

చేయవలసినది -

▲ **" తపస్సు " అంటే శారీరక అవసరాలను క్రమక్రమంగా తగ్గించుకుంటూ రావడం.**

▲ **" స్వాధ్యాయం " - అంటే**
**100% ఆత్మవికాసానికి పనికొచ్చే పుస్తకాలను సతతం చదువుతూ వుండడం.**

▲ **" ఈశ్వర ప్రణిధానం " - అంటే**
**" అంతా దైవమయం " అన్న ఎఱుకను సదా కలిగివుండడం.**

* * *

# " స్వాధ్యాయం "

" ధ్యానం "
అన్నది
ఎంత ముఖ్యమో
" స్వాధ్యాయం " అన్నది కూడా
అంతే ముఖ్యం;
అంత కన్నా ముఖ్యం.

ధ్యానుల అనుభవాలు పుస్తకరూపం పొందినప్పుడు-,
అవి అన్నింటికన్నా ఉత్కృష్టమైన గ్రంథాలు అవుతాయి ;
ఆ గ్రంథాలను చదవడం అన్నది చాలా, చాలా ముఖ్యం.

▲ **స్వాధ్యాయం మనిషి యొక్క**
**నాలుగవ శరీరాన్ని అంటే విజ్ఞానమయకోశాన్ని**
**శుద్ధి చేస్తుంది , అభివృద్ధి చేస్తుంది .**

* * *

# " ఒక యోగి ఆత్మకథ "

శ్రీ యోగానంద పరమహంస
వ్రాసిన
మహత్తరమైన పుస్తకం
" ఆటోబయోగ్రఫీ ఆఫ్ ఎ యోగి
(Autobiography of A Yogi) " ;
అదే తెలుగులో
" ఒక యోగి ఆత్మకథ " ;
" మహావతార్ బాబాజీ " గురించి చెప్పిన పుస్తకం.
మహావతార్ బాబాజీ అంటే ఈ భూమిని పర్యవేక్షిస్తున్న
పరమ గురువుల్లో అగ్రగణ్యుడు అన్నమాట.

ఈ పుస్తకంలో ముఖ్యంగా -
యుక్తేశ్వర్ గారి " పునరుత్థానం "
అనే అధ్యాయం -
మొత్తం పుస్తకానికే తలమానికమైనది !
చనిపోయిన తరువాత శ్రీ యుక్తేశ్వర్ గారు
సశరీరులుగా తిరిగి వచ్చి శ్రీ యోగానంద గారికి
మరణాంతర జీవితం గురించి
వివరించి చెప్పిన అద్భుత అధ్యాయం !

▲ " ఒక యోగి ఆత్మకథ " పుస్తకం
**చదివినవాడు నిస్సంశయంగా జిజ్ఞాసువుగా వెంటనే మారి తీరుతాడు.**

* * *

# " హిమాలయ యోగులు "

(స్వామీ రామా అనుభవాలు)

స్వామీ రామా
వ్రాసిన
అసమానమైన యోగ పుస్తకం -
" లివింగ్ విత్ ది హిమాలయన్ మాస్టర్స్
(Living with the Himalayan Masters) " ;

ఆ పుస్తకాన్ని
కర్నూలు స్పిరిచ్యువల్ సొసైటీకి చెందిన
స్వర్గీయ డాక్టర్ V.V. బాలకృష్ణ గారు
" హిమాలయ యోగులు " గా
తెలుగులోకి అద్భుతంగా అనువదించారు.

హిమాలయ పర్వతశ్రేణుల్లో వున్న
పరమ గురువుల యోగసిద్ధుల గురించీ,
వారి అపార జ్ఞాన సంపద గురించీ,
స్వామీ రామా స్వానుభవాలు యదాతథంగా వున్న పుస్తకం.

ఆధ్యాత్మిక లోకానికి స్వామీ రామా
చేసిన ఎనలేని సేవగా ఆచంద్రతారార్కం నిలిచిపోతుంది ఇది.

▲ యోగసాధకులు తప్పక చదువ వలసిన పుస్తకం .
▲ ఎన్నో ఆధ్యాత్మిక పాఠాలు నేర్పించే పుస్తకం .

* * *

# " సంభోగం నుండి సమాధి "

" సంభోగం "
అన్నది
భౌతిక ఆనందాలలో పరాకాష్ఠ.
అయితే,
దానికన్నా పరమమైనది
ధ్యాన - సమాధి స్థితిలో పొందబడే
ఆత్మపరమైన శాశ్వతమైన " బ్రహ్మానందం ".

అయితే " సంభోగం " సమాధికి అడ్డు కాదు !
" ధ్యాన-సమాధి " స్థితి సంభోగాని కి అడ్డు రాదు !

మానవుడు కేవలం సంభోగానందం అభిలషిస్తున్నాడే కానీ,
పరమానందకరమైన ధ్యాన - సమాధి స్థితిని కోరుకోవడం లేదు.

" అందరూ విధిగా ధ్యానం ద్వారా
దివ్యజ్ఞానప్రకాశం ద్వారా,
జన్మపరమార్థమయిన
ధ్యాన - జ్ఞాన - సమాధి స్థితిని కూడా పొంది తీరాలి "
- - అన్నదే ఓషో రజనీష్ యొక్క పరమ సందేశం.

▲ " ఫ్రమ్ సెక్స్ టు సూపర్ కాన్షియస్‌నెస్
(From Sex to Super-Consciousness) " -
. . తెలుగులో అనువదింపబడిన మొట్టమొదటి అద్భుత రజనీష్ పుస్తకం ఇది.

* * *

# " ఓషో రజనీష్ "

ఓషో !
వారేవా !
వాట్ ఎ గ్రేట్ మాస్టర్ !

రజనీష్ పుస్తకాలు
చదివితేనే జీవితం !
అవే వినోదం - వినోదం !
అవే ఆనందం - ఆనందం !
అవే జ్ఞానం - విజ్ఞానం !

ప్రపంచంలో వున్న అందరు జ్ఞానుల గురించీ,
వారి సహజ జీవిత విధానాల గురించీ,
ధ్యానానుభవాలను గురించీ,
పరిధి లేని ఆత్మవికాసం గురించీ,
వేలకొద్దీ చిరు జ్ఞానకథలనూ, చిన్ని చిన్ని కథానికలనూ ఉదహరిస్తూ
" న భూతో న భవిష్యతి " అన్న విధంగా
సుమారు 650 పుస్తకాల్లో విస్తృతంగా
విశ్లేషించిన
అద్భుత జ్ఞాని ఓషో రజనీష్ !

- ▲ నూతనం, నిస్సంకోచం, నిర్భయం, నిత్యానందమయం అయిన జీవితశైలి ని ' దివి ' నుంచి ' భువి ' కి దించ సాహసించిన దివ్యమూర్తి రజనీష్.
- ▲ ' రజనీష్ ' అంటేనే దురభిప్రాయం పెట్టుకున్నవారు, ఆయన పుస్తకాలేవీ చదవకుండానే ఆయనను నిందించేవారు, మహా ముదనష్టపు జాతకులు.

* * *

# " లోబ్‌సాంగ్ రాంపా "

శ్రీ లోబ్‌సాంగ్ రాంపా
1979లో నన్ను తట్టి లేపిన
కారుణ్యమూర్తి !
20 వ శతాబ్దపు
సాటిలేని గొప్ప టిబెట్ యోగి
లోబ్‌సాంగ్ రాంపా !

1983 లో దేహ విరమణ చేసినవాడు ;
20వ శతాబ్దపు ఆధ్యాత్మిక శాస్త్ర అధ్యాపకులలో అగ్రగణ్యుడు ;
" యూ ఫరెవర్ (You Forever) " అనే పుస్తకం
నా చేత చదివించి,
నా జీవిత లక్ష్యాన్ని నాకు ఎఱుక పరచిన
నా ప్రధమ ప్రియతమ ఆధ్యాత్మిక గురువు.
శ్రీ లోబ్‌సాంగ్ రాంపా !

సూక్ష్మశరీర యానం గురించీ,
దివ్యచక్షువు గురించీ,
ఆకాశ రికార్డుల గురించీ,
మరణాంతర జీవితం గురించీ,
తన స్వానుభవాల సహాయంతో తిరుగులేని విధంగా
వివరించిన మహాయోగి,
శ్రీ లోబ్‌సాంగ్ రాంపా !

▲ ఇరవై అద్భుత పుస్తకాల రచయిత .
▲ ఈలాంటి పుస్తకాలన్నీ చదివితేనే
మనకు ఆధ్యాత్మిక శాస్త్రం సుపరిచయం అయ్యేది .

* * *

# " రిఛార్డ్ బాక్ "

పూర్ణ ఆధ్యాత్మిక వికాసానికి సంపూర్ణ ప్రతిరూపం
రిఛార్డ్ బాక్.

ఆయన పుస్తకాలు - " జొనాథన్ లివింగ్స్టన్ సీగల్ (Jonathan - Livingston Seagull) " ; " ఇల్యూషన్స్ (Illusions) " ;
" బ్రిడ్జ్ అక్రాస్ ఫరెవర్ (Bridge Across Forever) " ;
" వన్ (One) "; " రన్నింగ్ ఫ్రమ్ సేఫ్టీ (Running from Safety) " -
మొదలైనవి అసమాన ఆధ్యాత్మిక జ్ఞానమణులు!
ఉదాహరణకు, " ఇల్యూషన్స్ "
అనే పుస్తకం లోంచి ఒక ఆణిముత్యం -

" ది మార్క్ ఆఫ్ యువర్ ఇగ్నొరెన్స్ ఈస్ ది
డెప్త్ ఆఫ్ యువర్ బిలీఫ్ ఇన్ ఇన్‌జస్టిస్ అండ్ ట్రాజెడీ!"
అంటే,
" ' అన్యాయం ', ' విషాదం ' అనేవి వున్నాయని మీరు ఎంత ప్రగాఢంగా నమ్మితే, వాస్తవానికి అంత ' అజ్ఞానం ' మీకు వుందన్న మాట ! " - అని దీని అర్థం.

▲ **తింటే గారెలే తినాలి ;**
**చదివితే రిఛార్డ్ బాక్ పుస్తకాలే చదవాలి .**

* * *

# " కాస్టానెడా / డాన్ యువాన్ "

ఆధునిక ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులలో,
ఆధ్యాత్మిక శాస్త్ర అధ్యాపకులలో,
ప్రప్రథమశ్రేణి వారు కాస్టానెడా/డాన్ యువాన్‌లు.

డాన్ యువాన్ చెప్పిన ఒక సూత్రం ;
" జిజ్ఞాసువు ముముక్షువు అయినప్పుడు
అచిరకాలంలోనే అతడు జ్ఞానిగా మారి
సాధనా పరిసమాప్తి ద్వారా చివరికి ' ద్రష్ట ' అవుతాడు ."

- జిజ్ఞాసువు (Apprentice)
  - ముముక్షువు (Warrior)
    - జ్ఞాని (Knower)
      - ద్రష్ట, ఋషి (Seer)

" జిజ్ఞాసువు" అంటే సత్యసిద్ధి ప్రాప్తికి ప్రప్రథమంగా కృతనిశ్చయుడైనవాడు.
" ముముక్షువు " అంటే ఇక సత్యశోధనలో, సాధనలో పూర్తిగా
నిమగ్నుడైనవాడు.
" జ్ఞాని " అంటే చివరికి సత్యసిద్ధి పొందినవాడు.
" ద్రష్ట ", " ఋషి ", అంటే దివ్యచక్షువు కలిగినవాడు.

▲ **డాన్ యువాన్ గురించీ మరి అతని ఇతర గురువుల, సహచరుల, యోగ సిద్ధుల గురించీ, వారి పరిపక్వ ఆత్మజ్ఞానం గురించీ, అతని శిష్యుడు కార్లోస్ కాస్టానెడా వ్రాసిన అద్భుత పుస్తకాలు చదివి తీరాలి, అధ్యయనం చేసి తీరాలి.**

* * *

# " ఆత్మజ్ఞానం - బ్రహ్మజ్ఞానం "

" ఆత్మజ్ఞానం " అంటే
" ఆత్మ గురించి జ్ఞానం " -
అంటే, తన గురించి తాను తెలుసుకోవడం,
" నేను భౌతిక శరీరం మాత్రమే కాదు, శరీరధారిని కూడా " - అని
తెలుసుకోవటం ;
" నేను మూల చైతన్యం " అని తెలుసుకోవటం.
ఇదంతా ధ్యానం ద్వారానే సాధ్యం.

ఆత్మజ్ఞానం అన్నది ' తొలిమెట్టు ' అయితే, బ్రహ్మజ్ఞానం అన్నది ' మలిమెట్టు '

" బ్రహ్మజ్ఞానం " అంటే " సకల చరాచర సృష్టి యొక్క జ్ఞానం " -
కోటానుకోట్ల లోకాల గురించి వీలయినంత సుస్పష్ట విజ్ఞానం.

" ఆత్మజ్ఞానం " లేనిదే " బ్రహ్మజ్ఞానం " అన్నది అసంభవం.
ఆత్మజ్ఞానే " ఋషి " ; బ్రహ్మజ్ఞానే " బ్రహ్మర్షి " .

తన నిజ స్థితిని తెలుసుకున్నవాడు ' ఆత్మజ్ఞాని '.
తన బయటి ప్రకృతిని అర్థం చేసుకుని దాన్ని సంపూర్ణంగా
అధీనం చేసుకున్నవాడే ' బ్రహ్మజ్ఞాని '.

బ్రహ్మజ్ఞాని అయినప్పుడే ' బ్రహ్మ పదవి ' లభిస్తుంది.
" బ్రహ్మ " అంటే " క్రియేటర్ (creator) " అని ;
అతను కొన్ని ఆత్మలనూ, కొన్ని లోకాలనూ సృష్టి చేయగలవాడు ;
అంటే, " స్వంతంగా సృష్టి చేయగలవాడు " అని.
సకల లోక జ్ఞాని అయినవాడే నూతన లోకాలను సృష్టించగలడు.

▲ **ఆత్మజ్ఞానం ధ్యానం ద్వారా లభించే ప్రథమ స్థితి ;**
**బ్రహ్మజ్ఞానం దివ్యచక్షువు యొక్క పరమ పరిపక్వతా స్థితి .**

# " మాయ "

" మాయ "

అనే పదానికి నిర్వచనం -

" యా మా సా మాయా " అని.

| | |
|---|---|
| యా = ఏదైతే | మా = లేదో |
| సా = అది (దానిని) | మాయా = మాయా (అని అంటారు) |

అంటే,

" ఏదైతే లేదో, " అంటే " దేనికైతే అస్తికత లేదో ",

దానికి " మాయ " అని పేరు.

నిజానికి,

ప్రపంచంలో రెండే రెండు వస్తువులు " మాయ " -

ఒకటి - " చావు " అనే భావన ; రెండు - " నేను వేరే, నువ్వు వేరే " అనే భావన.

" చావు " ఎక్కడా లేదు ; ఉన్నదల్లా ఆది, అంతం లేని పరిణామ క్రమమే !

" చావు " లేదని తెలుసుకున్నవాడే " మాయ " లోంచి బయటపడినవాడు !

అలాగే " అహం బ్రహ్మాస్మి", " తత్త్వమసి " ; అంటే, " నేనూ అదే ", " నువ్వూ అదే ".

" మమాత్మా సర్వ భూతాత్మా" అని తెలుసుకున్న వాడే " మాయ లోంచి బయటపడినవాడు ".

" దేహాత్మ భ్రాంతి " వున్నవాడే " మాయలో చిక్కినవాడు ".

" దేహాత్మ భ్రాంతి " అంటే " దేహమే నేను " అన్న భ్రాంతి కలవాడు.

" ఆత్మే దేహం " అన్న జ్ఞానం వున్నవాడే " మాయ లేనివాడు ".

అంటే, " నేను " అనే భావనే తన " దేహం ", తన " స్వరూపం " అని తెలుసుకున్నవాడు.

▲ ధ్యానం ద్వారానే దేహాత్మభ్రాంతి తొలగుతుంది .

▲ ధ్యానం ద్వారానే " మమాత్మా సర్వభూతాత్మా " అని తెలుసుకుంటాం.

* * *

## " మూడు అడుగులు "

" భూలోక, భువర్లోక, స్వర్గలోకా " లనే మూడు అడుగులను
వామనుడు బలిచక్రవర్తి ని కోరాడు.

" భూలోక " మంటే ఏమిటి ?
మన శరీరమే " భూలోకం " ;
దీనినే కొంతమంది " ప్రకృతి " అని కూడా అంటారు.
ఇంక, మనస్సే " భువర్లోకం ".
ప్రజ్ఞయే " సువర్లోకం ".

" బలి " అంటే " పన్ను " లేక " సుంకం (టాక్స్) ".
మన ఇంటికి నీరు సరఫరా చేసినందుకు మున్సిపాలిటీ కి
పన్ను కడతాం కదా !
అదేవిధంగా, మానసిక సంబంధమైన దానికి కూడా ' పన్ను ' కట్టాలి.
బలిచక్రవర్తి కట్టిన సుంకం ఏమిటి ?
తన శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులన్నింటినీ
భగవంతునికి ధారపోయడం.

పురాణాలలోని కథలు కొన్ని విచిత్రంగా వుంటాయి.
భగవంతుని ఒక పాదం భూలోకాన్నంతా ఆక్రమించిందట !
రెండవ పాదం ఆకాశాన్నంతా వశం చేసుకున్నదట !
మూడవ పాదం బలిచక్రవర్తి తలపై పెట్టాడట !
అంటే, శారీరక భ్రాంతిని ధ్వంసం చేశాడని అర్థం.

- శ్రీ సత్యసాయి

(సనాతన సారథి, అక్టోబరు '94)

▲ శారీరకంగా , మానసికంగా , మరి అధ్యాత్మికంగా -
మూడింటిలోనూ భగవంతుడు ప్రవేశించాడు ; దీని అంతరార్థమిదే .

# " మూషిక వాహనుడు "

" వినాయకుడు " అన్నవాడు
" మూషిక వాహనుడు " !

" ఇంత పెద్ద పొట్ట గలవాడు ఇంత చిన్న ఎలుక మీద
ఏ రీతిగా కూర్చోగలడు ? " అని
అనేకమంది విమర్శలు చేస్తూ వచ్చారు.
నిజంగా దీని అంతరార్థం తెలియని మూర్ఖులే,
ఇలాంటి అనర్థాలను అభివృద్ధి చేసి
యదార్థాలను విస్మరిస్తున్నారు.

" మూషికం " అంటే " చీకటి " కి గుర్తు.
" వినాయకుడు " అన్నవాడు చీకటి ని తన క్రింద వేసుకున్నాడన్నమాట ;
అంటే చీకటి ని అణగద్రొక్కాడు.

- శ్రీ సత్యసాయి

(సనాతన సారధి, అక్టోబరు '94)

▲ కనుక ,
" మూషిక వాహను " డంటే " ఎలుకనెక్కిన వాడ " ని కాదు ;
" చీకటిని అణగద్రొక్కి జ్ఞాన ప్రకాశాన్ని అందించిన వాడ " ని అర్థం

* * *

# " ఆహారం, వ్యవహారం "

" దేహం " అన్నది వేరే,
" దేహి " అన్నది వేరే.

అన్నం, నీరు, రొట్టె మొదలయినవన్నీ
మన " దేహా " నికి ఆహారం మాత్రమే.
అంతేకానీ, ' దేహి ' కి కాదు.
అంటే, " మన " కు కాదు.

పంచ జ్ఞానేంద్రియాల ద్వారా,
బహిర్ జ్ఞానం " శరీరం లోపలి చైతన్యాన్ని " అంటే " దేహి " ని చేరి
దానిని ఉత్తేజపరచేదే, " మన " కు ఆహారం.

పంచ కర్మేంద్రియాల ద్వారా,
" మనం " చేసే చేష్టలే మన " వ్యవహారం ".

ఉదాహరణకు :

మన మాటలు ఇతరులకు వారి చెవుల ద్వారా " ఆహారం " అవుతుంది ;
మన చేష్టలు ఇతరులకు వారి కళ్ళ ద్వారా " ఆహారం " అవుతుంది.

▲ **మన వ్యవహారం ఇతరులకు ఆహారం .**
▲ **ఇతరుల వ్యవహారం మనకు ఆహారం .**

* * *

# " ఆహార వ్యవహారాలలో జాగ్రత్త వహించాలి "

" ఆహారంలో జాగ్రత్త వహించాలి " -
అంటే,
చెడు వినరాదు, చెడు చూడరాదు.
" చెడు " అంటే " పనికిరానివి " అన్నమాట ;
అంటే, మనకు అనవసరమైన వాటిని మనం పట్టించుకోరాదని.

అలాగే,
" వ్యవహారంలో జాగ్రత్త వహించాలి " -
అంటే,
" చెడు పలకరాదు " అని ;
" మనకు తెలియనివి తెలిసినట్లు పలుకరాదు " అని ;
" ఉభయత్రా అనవసరపు మాటలు ససేమిరా కూడదు " అని.

ఇదే గాంధీ గారి " మూడు కోతుల " నీతి సూత్రం.

▲ **" ఆహార - వ్యవహారాలలో జాగ్రత్త వహించాలి " అంటే**
**" పనికిరాని దృశ్యాలు చూడరాదు ;**
**పనికిరాని మాటలు వినరాదు ;**
**పనికిరాని మాటలు పలుకరాదు " - అని.**

* * *

# " అశోక వనం "

" సీతాదేవి
అశోకవనం లో, అశోకవృక్షం క్రింద,
వలవలా యేడ్చింది ! "

ఇది నిజమేనా ?
కాదు !

ఇందులో వాల్మీకి మహర్షి యొక్క కవితా చాతుర్యం వుంది.
పామరులకి సంకేతం గా, " భర్త ఎడబాటు అయింది " -
కనుక " వలవలా యేడ్చింది " అన్నాడు.
అయితే, ఆవిడ మహాజ్ఞానురాలు, మహాయోగిని.
ఆవిడ కు " శోకం " అన్నదే అసంభవం !
కనుక, " అశోక " వనం అన్నాడు ;
" అశోక " వృక్షం అన్నాడు.

" అశోక " అంటే అ + శోక =
" ఎక్కడ శోకం లేదో అక్కడ " అన్నమాట.

▲ **కనుక ,**
**సీతాదేవి ' శోకగ్రస్త ' అయిందన్నది నిజానికి అవాస్తవం .**

* * *

# " సవిరామ పరిశ్రమ "

" పరిశ్రమ " అన్నది ఎప్పడూ చేసే తీరాలి.

అప్పడే పనులు జరుగుతాయి ;
అప్పడే విద్యలు అన్నీ అబ్బుతాయి.
అప్పడే కళలను పూర్తిగా నేర్చుకుంటాం.

అయితే,

" అవిరామ " పరిశ్రమ మాత్రం పనికి రాదు.
ఎప్పడూ " సవిరామ " పరిశ్రమ పద్ధతే సరియైనది.

" స + విరామ " = " విశ్రాంతితో కూడిన "
" అ + విరామ " = " విరామం లేని "

అవిరామ పరిశ్రమ వల్ల మొదటికే మోసం వస్తుంది.
" అవిరామం " అన్నది మోహం, అతి.

▲ మోహం అన్నది , అతి అన్నది , ఎప్పుడూ కూడదు ;
అతి సర్వదా అనర్థహేతువే .
▲ పరిశ్రమ ఎప్పుడూ ' సవిరామం ' గానే వుండాలి .

* * *

## “ మేనకా ప్రయోగం ”

వసిష్ఠుడి లాగా
బ్రహ్మర్షిగా
వెంటనే కావాలని
“ అవిరామ పరిశ్రమ ” చేస్తున్నాడు విశ్వామిత్రుడు.

అది గమనించి ఇంద్రుడు -
“ ఆ పద్ధతి సరికాదు; అది స్వయం హానికరం ” -
అని తెలుసుకున్నవాడు కనుక
కనికరించి,
మేనకను పంపి ఒకింత విరామం కలిగేటట్లు చేశాడు.

కొన్ని నెలలు మేనకతో కలిసి విశ్రమించిన తరువాత
విశ్వామిత్రుడు తిరిగి సాధన చేపట్టి
అచిరకాలంలోనే “ బ్రహ్మర్షి ” కాగలిగాడు.

మూర్ఖంగా ప్రవర్తించేవారికి
సహాయపడే వాడే ఇంద్రుడు ;
కానీ, అతనిని ఎలా చిత్రీకరించారు !

▲ అతి ఆతురత అన్నది ఎప్పుడూ హానికరం ;
నిదానంగా , నిలకడగా వుంటేనే దేనిలోనైనా గెలుపు .
▲ నిదానం ప్రధానం !

* * *

# " దత్తాత్రేయ "

" ముని " అంటే మౌని.
" వాక్ మౌనం " వున్నవాడన్న మాట.
' మహా ముని ' అంటే చిత్తం వృత్తి రహితమయిన వాడన్నమాట.
" అ + త్రి " = " అత్రి " = " త్రిగుణాలను దాటినవాడు ".
" ' అత్రి ' కాని వాళ్ళు " అంటే త్రిగుణాలలో మునిగి తేలే త్రిగుణాత్మకులు.

తమకన్నా ఎక్కువగా కండబలం, దేహ సౌందర్యం, అధికారాలు,
పదవులు, చదువులు, సంస్కారాలు వున్నవారి పట్ల అసూయతో,
ద్వేషాలతో వుండడం సర్వసామాన్యం.
అయితే, త్రిగుణాలను దాటి ఆత్మపరంగా వున్నప్పుడు కూడా
ఒక్కోసారి అసూయ వుండవచ్చు -
విశ్వామిత్రుడిలాగా - " తాను ' రాజర్షి ' ని మాత్రమే ;
మరొకరు ' బ్రహ్మర్షి ' " అని !
మనిషికి చివరిగా ' ఈ ఆధ్యాత్మిక అసూయ ' కూడా వుండరాదు.
అంటే, అత్రి ' మహాముని ' గా అయినా ' అనసూయ ' తో కాపురం చేయాల్సిందే !
' అసూయ ' లేని స్థితే ' అనసూయ ' స్థితి.
అప్పడే, అంతా ' దత్త ' మవుతుంది, సిద్ధులన్నీ వస్తాయి.
అలా అష్టసిద్ధులన్నీ ' దత్త ' మయిన స్థితే " దత్తాత్రేయ " స్థితి.

అందుకే, జీసస్ అన్నారు -
" దేవుని రాజ్యం చేరి, ఆ సత్యం లో, ఆ ధర్మం లో వసించండి ;
అప్పుడు మీ దగ్గరికే అన్నీ చేర్చబడతాయి " అని.
" దేవుని రాజ్యంలో చేరడం " అంటే " అత్రి మహాముని అవడం ".
" ఆ సత్యం లో, ఆ ధర్మం లో వుండడం " అంటే
" అనసూయతో సంసారం చేయడం ".
" అప్పడు మీ దగ్గరికే అన్నీ చేర్చబడతాయి " ; అంటే " దత్తాత్రేయ స్థితి " అన్నమాట.

▲ **త్రిగుణాలు దాటి , నిర్గుణంలో సదా ' అనసూయా స్థితి ' లో స్థితమయినప్పుడే సర్వ సిద్ధులూ దత్తమవ్వుతాయి .**

# " ఏడుకొండలవాడు "

వేంకటేశ్వరస్వామి
అంటే, " ఏడుకొండలవాడు ".

" ఏడుకొండలు దాటి వెళ్ళాలి " కనుక " ఏడుకొండలవాడు " -
అని లోకులు సాధారణంగా అనుకుంటూంటారు.

అయితే,
" ఏడుకొండలు " అన్నవి ఏడు శరీరాలనూ,
ఏడు చక్రాలనూ సూచిస్తాయి.

కనుక,
తన ఏడు చక్రాలనూ పూర్తిగా స్వాధీనం చేసుకుని,
తన ఏడు శరీరాలనూ పరిపూర్ణంగా ఉత్తేజితం
చేసుకున్న వాడినే
" ఏడుకొండలవాడు " అని అంటాం.

ప్రతి పరమగురువూ ఏడుకొండలవాడే ;
ప్రతి ధ్యానీ చివరికి అయ్యేది " ఓ ఏడుకొండలవాడు " గానే.

▲ **1500 సంవత్సరాలుగా యోగస్థితిలో వుంటూ ఇప్పటికీ
తిరుమల కొండల్లో మన మధ్య భౌతిక శరీర ధారియై వుండి , మార్గదర్శియై
మనల్నందరినీ ఎంతగానో అలలారిస్తున్న ఓ మహాయోగిపుంగవుడే
ఓ ఏడుకొండలవాడే శ్రీ వేంకటేశ్వరస్వామి .**

* * *

# " పుత్రుడు - పున్నామనరకం "

" పునః నామ నరకం " -
అంటే,
" మళ్ళీ మళ్ళీ ' పేరు ' తీసుకునే ' నరకం ' ".

అంటే, " పునర్జన్మ " అన్నమాట.

" పుత్రుడు " అంటే, " వారసుడు ".
మన గుణాలను సంతరించుకున్నవాడు -
మన జ్ఞానాన్ని గ్రహించినవాడు.

కనుక,

" పుత్రుడు మనలను ' పున్నామ నరకం ' నుండి తప్పిస్తాడు " -
అంటే,
' మన ఆత్మశిష్యుల ద్వారానే మనకు జన్మరాహిత్యపదవి వస్తుంది "
అన్నమాట.
పుత్రుడు ' అంటే శారీరక వారసుడు కాదు, మానసిక వారసుడు.

▲ **మనలాంటి ఆత్మజ్ఞానులను కొంతమందినైనా తయారు చేస్తేనే మనకు మరి మరుజన్మ నుండి విడుదల .**

* * *

# " చతుర్ముఖేన బ్రహ్మః "

" బ్రహ్మకు నాలుగు ముఖాలు " అంటారు.

' అహం బ్రహ్మాస్మి ' అనే వేదవాక్కు ప్రకారం
' అహం ' అంటే ' బ్రహ్మ '.
' నేను ' అనేదే ' బ్రహ్మ '.
" నేను " అంటే " ఆత్మపదార్థం " అన్నమాట.

" చతుర్ముఖాలు " అంటే నాలుగు ద్వారాలు.
ఈ ' నేను ' ను చేరుకోవడానికి నాలుగు ద్వారాలు ఉన్నాయి.
నాలుగు మార్గాలే నాలుగు ' ముఖాలు '.
" నేను " అనేది నాలుగు తత్త్వాలుగా ప్రస్ఫుటమవుతోంది.
అవే - " మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు ".

ఒకే వ్యక్తి, తండ్రితో ఉండటప్పుడు ' కొడుకు ' అనీ,
కొడుకుతో ఉండేటప్పుడు ' తండ్రి ' అనీ,
సోదరుడుతో ఉండేటప్పుడు ' సోదరుడు ' అనీ,
మనుమడుతో ఉండేటప్పుడు ' తాత ' అనీ వ్యవహరించబడినట్లు,
ఒకే " నేను " వివిధ పరిస్థితులలో విభిన్న వస్తువులుగా
పరిగణింపబడుతోందన్నమాట.

▲ సంకల్ప వికల్పాలు చేసేటప్పుడు ' మనస్సు ' గా ,
నిత్యానిత్యాలను , మంచిచెడులను చెప్పేటప్పుడు ' బుద్ధి ' గా ,
నిరంతర చింతన చేసేటప్పుడు ' చిత్తం ' గా ,
' నేను ', ' నాది ' అనేటప్పుడు ' అహంకారం ' గా -
ఆత్మపదార్థాన్ని అంటే " నేను " ను మనం వివరిస్తాం .

* * *

# " దుష్టచతుష్టయం - నాలుగు యోగాలు "

" చతుర్ముఖేన బ్రహ్మః " అన్నారు.

అంటే, " బ్రహ్మకు నాలుగు ముఖాలు వున్నాయి " అని.
" అహం బ్రహ్మాస్మి " అంటే ' నేను ' అన్నదే ' బ్రహ్మ ' ".

మహాభారతంలో
" దుష్టచతుష్టయం " అన్నది
" మనోబుద్ధిచిత్తాహంకారాలు " అనే చతుర్ముఖాలను సూచిస్తుంది.

- మనస్సు = దుశ్శాసనుడు
- బుద్ధి = కర్ణుడు
- చిత్తం = శకుని
- అహంకారం = దుర్యోధనుడు

అలాగే, మహాభారతంలో కృష్ణుడు ' బ్రహ్మ ' కు సూచిక.
" చతుర్ముఖాల " ద్వారా నాలుగు యోగాలూ
సూచించబడ్డాయి.

- ▲ భక్తియోగం : అహంకారాన్ని అంటే ' నేను ', ' నాది ' అనే భావాలను, పూర్తిగా తుడిచి పెట్టడం.
- ▲ కర్మయోగం : సంకల్ప వికల్పాలను ఆత్మాత్మకంగా సరి చేసుకుంటూ మనస్సును శుద్ధి చేసుకోవడం.
- ▲ జ్ఞానయోగం : బుద్ధిని సునిశితం చేయడం , అంటే నిత్యానిత్య విచక్షణా జ్ఞానాన్ని పెంపొందించుకోవడం .
- ▲ రాజయోగం : చిత్త వృత్తులను నిరోధించి , సమాధి ప్రజ్ఞను పొందడం.

* * *

# " చిత్రగుప్తుడు "

వాస్తవానికి

ఇది

" గుప్త-చిత్రం ".

● గుప్త = రహస్యమైన

● చిత్రం = రికార్డులు

అంటే, 'ఆకాశరికార్డులు' అన్నమాట.

ప్రపంచంలో ప్రతీదీ ఆటోమాటిక్‌గా

అనంతపు ఆకాశతత్త్వంలో ' రికార్డు ' అయిపోతూ వుంటుంది.

దివ్యదృష్టితో ఈ రికార్డులను చూసి, భూత, భవిష్యత్

వర్తమానాల గురించి ఎంచక్కా తెలుసుకోవచ్చు.

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి ధ్యానం లో ఈ " గుప్త చిత్రాల " ను

చూసే " కాలజ్ఞానం " వ్రాయగలిగారు ;

అలాగే నోస్ట్రడేమస్ కూడా.

▲ ప్రతి యోగీ తన దివ్యచక్షువు ఉపయోగించి
ఈ గుప్తచిత్రాల ద్వారా సర్వం తెలుసుకుంటూ వుంటాడు .

* * *

# " దర్పదః - దర్పహః "

" విష్ణుసహస్రనామాలు " అంటే,
ఒక జ్ఞానికి వున్న అనంతమైన గుణాల వివరణ.

అందులో,
మచ్చుకు రెండు :
" దర్పదః ", " దర్పహః " -

దర్ప + దః = దర్పదః
" దర్పదః " అంటే " గర్వాన్ని కలిగించేది ".
ఇక్కడ ' గర్వం ' అంటే ' అహంకారం ' అని కాదు ;
ఇక్కడ ' గర్వం ' అంటే ' ఆత్మవిశ్వాసం ' అని.
" నాకూ సత్యం తెలుసు " అన్న స్ఫూర్తి కలిగివుండటం.

ఇకపోతే,
దర్ప + హః = దర్పహః -
" దర్పహః " అంటే, " గర్వాన్ని హరించేది. "
" నాకే సత్యం తెలుసు " అన్న గర్వాన్ని హరించేది.

▲ **ప్రతి జ్ఞానికీ ఒక విధమైన ఆత్మవిశ్వాసం వస్తుంది ; వచ్చి తీరాలి .
మరొక రకమైన గర్వం మటుమాయమై పోతుంది ; పోయి తీరాలి .**

* * *

# " గరళ కంఠుడు "

గరళం = విషం,
కంఠుడు = కంఠం లో ధరించిన వాడు.

ఈ ప్రపంచంలో మిడిమిడి జ్ఞానం వల్ల,
మనుష్యులు సదా విషం క్రక్కుతూ వుంటారు ;
దుష్టభావనలను ఉత్పత్తి చేస్తూ వుంటారు.
దీనినే ' నెగిటివిటీ ' అంటాం.
' నెగిటివిటీ ' యే ' విషం '.
మనం దానిని మింగకుండా, మన ' కంఠం ' లోనే పెట్టుకోవాలి.
అంటే, ' విశుద్ధ ' చక్రంలోనే పెట్టుకుని శుద్ధి చేయాలి.
అలా చేసేవాడే " గరళ కంఠుడు ".

శ్రీ రత్నాకరం బాలరాజు గారు
' ధమ్మపదం ' పుస్తకంలో చక్కగా చెప్పారు :

" చంద్రుణ్ణీ, హాలాహల విషాన్నీ ఈశ్వరుడు గ్రహించినట్లు,
పండితుడు అందరి గుణాలనూ శిరసా శ్లాఘించి,
దోషాలను మటుకు కంఠమందే నిల్పుకుంటాడు ; బహిర్గత
మొనరింపడు " అని.

▲ ' గరళకంఠులు ' కానిదే ఎవ్వరూ, ఎప్పటికీ ఆత్మజ్ఞానులుగా కాలేరు.

* * *

# " త్రిపుర సుందరి "

" త్రిపుర సుందరి "
అంటే
దేవతా మూర్తి కాదు ; ఆత్మ పదార్థం.

| | | |
|---|---|---|
| త్రి | = | మూడు |
| పుర | = | పురాలలో వున్న |
| సుందరి | = | సుందరమైనది |

మూల చైతన్యమే సుందరమైనది - ఇదే అసలు ' సుందరి ' ;
అయితే,
ఈ మూల చైతన్యం ప్రకృతి తత్త్వాలతో తాదాత్మ్యం చెందుతూ
క్రమక్రమంగా మూడు తొడుగులను సంతరించుకుంటుంది.
1. కారణ శరీరం 2. సూక్ష్మశరీరం 3. స్థూల శరీరం
ఈ మూడు శరీరాలే " మూడు తొడుగులు ", " మూడు పురాలు ".
ఆత్మపదార్థం అన్నదే ఈ పాంచ భౌతిక లోకాలకి వచ్చేసరికి
" త్రిపురసుందరి " లా వెలుగుతోంది.

" త్రిపురసుందరి " ని " బాల" అని కూడా వర్ణిస్తారు.
' బాల ' అంటే నిత్య నూతనమైనది ; నిత్య యవ్వనమైనది ; నిత్య శోభాయమానమైనది ;
ఈ లక్షణాలన్నీ ఆత్మతత్త్వం యొక్క గుణగణాలను సూచిస్తాయి.

అందుకే, శ్రీ త్యాగరాజు ఇలా గానం చేశారు -
" దారిని తెలుసుకొంటి - త్రిపుర సుందరిని తెలుసుకొంటి " అని.

▲ **' ఆత్మతత్త్వాన్ని ' తెలుసుకోవడానికి వున్నది ఒకే ' దారి ' -**
**అదే ' ధ్యానం '.**

* * *

# " అహమేవ శరణం మమ! "

" భక్తియోగం " లో
మామూలుగా మనం వింటూ వుంటాం
" త్వమేవ శరణం మమ " అని.

అంటే,
" నీవే నాకు దిక్కు " అని.

ఈ స్థితి మనలను నిర్వీర్యులు చేస్తుంది.
ఎప్పుడూ ' త్వమేవ ', ' త్వమేవ ' అంటూ వుండడం
మన గోతిని మనమే త్రవ్వుకోవడం లాంటిది.

▲ **కనుక,**
**ఎప్పుడూ , " అహమేవ శరణం మమ " అనుకోవాలి ;**
**అంటే , " నాకు నేనే శరణు " అని .**
**ఇదే సరియైన జీవన జ్ఞాన దృక్పథం .**

* * *

# " శేషశయనుడు "

శేషుడు = సర్పం
శేషశయనుడు = సర్పం మీద పడుకుని వున్నవాడు

' సర్పం ' కాలానికి చిహ్నం, కాలానికి ప్రతీక.
అందుకే ' కాల సర్పం ', ' కాల నాగు ' అని అంటారు.

" కాలం "
అనే అనవగాహన లోంచి
సంపూర్ణంగా బయటపడ్డవాడే
ఓ " శేషశయనుడు ".

వాస్తవానికి దివ్యజ్ఞాన సంపన్నుడే " శేషశయనుడు " ;
దివ్యజ్ఞాన హీనుడే ' కాలం ' అనబడే
సర్పం లోపలి అంధకారంలో కొట్టుకుపోతున్నవాడు !

▲ " నేను ఆత్మను " అని తెలుసుకున్న ప్రతివాడూ ఓ " శేషశయను " డే!

* * *

# " శివుడు - మూడో కన్ను "

శివుడికి
" మూడోకన్ను " ఉంటుందట !
" మూడోకన్ను " తెరిస్తే అంతా భస్మమవుతుందట !
కరెక్టే !

" శివ " అనే పదానికి " ఆనందం " అని ఒక అర్థం.
" మంగళకరం " అనే మరో అర్థం కూడా ఉంది.
కనుక, " శివుడు " అంటే " ఆనందమయుడు " అని ;
" మంగళకర జీవితం జీవిస్తున్నవాడు " అని.
అయితే, ఈ ' శివ ' పదవి ఎలా సాధ్యం ?

ఎవరైతే తమ తమ " మూడోకన్ను " ను,

అంటే, అతీంద్రియ శక్తులను ఉత్తేజపరచుకుంటారో
వారందరూ ' శివు ' లే అవుతారు.
' శివుడి ' కి మాత్రమే ' మూడోకన్ను ' కాదు ;
" మూడోకన్ను " ఉన్న ప్రతి మనిషీ " శివుడు " అనబడతాడు.
ఎప్పుడైతే మన దివ్యచక్షువు తెరుచుకుంటుందో,
అప్పుడే, మన అజ్ఞానం ' భస్మ ' మవుతుంది.
అప్పుడే, మన ' వి ' కారాలు భస్మమవుతాయి ;
' వి ' అంటే ' అతి '.
కామ ' వి ' కారం భస్మమయి కామ ' స ' కారం నిలుస్తుంది.

▲ **ధ్యానం ద్వారానే ' మూడోకన్ను ' ఉత్తేజితమయి**
**' శివ ' పదవి లభ్యమవుతుంది .**

* * *

కృ = చేయటం

ష్ణ = తినటం

చేయవలసినదాన్నంతా చేసి,
అనుభవించవలసినదాన్నంతా అనుభవిస్తున్నవాడే " కృష్ణుడు ".

తెలుసుకోవలసినదాన్నంతా తెలుసుకుని,
పొందవలసిన ఫలాలను హాయిగా అనుభవిస్తున్నవాడే
ఏ " కృష్ణు " డైనా.

▲ **ఒకానొక దేవకీపుత్రుడు ' కృష్ణుడ 'య్యాడు ;**
**ఇక మనమంతా కూడా ' కృష్ణు 'లం గా కావాలి .**

* * *

అయోధ్య = యోధ్య కానిది

" యోధ్య " అంటే " జయింపబడేది ".

" అయోధ్య " అంటే " ఎంత యుద్ధం చేసినా జయింపలేనిది ".

కనుక,

" అయోధ్య "

అంటే, ఈ భౌతిక శరీరం అన్నమాట.

దశ = పది ;

రథుడు = రథాలు కలిగిన వాడు

" దశరథాలు " అంటే,

ఐదు జ్ఞానేంద్రియాలు ; ఐదు కర్మేంద్రియాలు.

కనుక,

" దశరథుడు " అంటే,

" దశేంద్రియాలతో కూడుకున్న అంశాత్మ " అన్నమాట.

▲ **" దశరథుడు అయోధ్యను పరిపాలిస్తున్నాడు " అంటే -**
**" అంశాత్మ ఈ దశేంద్రియాలతో కూడి భౌతిక శరీరంలో నివసిస్తోంది"**
**అని అర్థం.**

* * *

ఇంద్రియాలను జయించిన వాడే
" ఇంద్రుడు ".

" ఐరావతం " అన్నది ఇంద్రుని వాహనం.
అది తెల్లని ఏనుగు.
ఏనుగు సాత్వికరూపం.
తెలుపు శుద్ధత ను సూచిస్తుంది.
అందుకే,
" ఐరావతం " అంటే " శుద్ధసత్వం ".

శుద్ధసత్వాన్ని సంతరించుకున్నవాడే
ఇంద్రియాలను జయిస్తాడు.

మహామహులైన యోగులందరూ " ఇంద్రు "లే.
అటువంటి వారి మాటలకూ, చేష్టలకూ తిరుగు వుండదు..
ఆ స్థితినే " ఒక మాట, ఒక బాణం " అన్నారు.
అందుకే,
" ఇంద్రుని " ఆయుధం " వజ్రాయుధం ".

▲ తపస్సు అంటే ధ్యానం ; ధ్యానం ద్వారానే ' ఇంద్రస్థితి ' వచ్చేది .
మన అందరి ధ్యేయం ' ఇంద్రులు ' గా కావడమే .

* * *

ఇంద్రుడి దగ్గర,
దేవతల దగ్గర,
" కల్పతరువు ", " కామధేనువు ", " చింతామణి " -
మొదలయినవి ఉంటాయి ;
వాటి ప్రాప్తి వలన
మనం ఏది కావాలంటే అది పొందవచ్చును ;
మన కోరికలన్నింటినీ తీర్చుకోవచ్చును.
ఇదంతా నిజమా ? అవును !
ఈ పదాలన్నీ చక్కటి ఆధ్యాత్మిక సత్యాలను సూచిస్తాయి.
" కల్పన " అంటే " మనోశక్తి "
మన మనోశక్తి ద్వారా మనం సాధించలేనిది అంటూ ఏదీ లేదు !
" కామం " అంటే " కోరిక ".
మనం గట్టిగా ఏది కోరుకున్నా అది అచిరకాలంలో
మన వద్దకు వచ్చి తీరుతుంది !
అలాగే " చింతన " అంటే " మేధస్సు యొక్క ఉపయోగం ".
శాస్త్రీయ చింతన ద్వారానే అన్ని చిక్కులనూ విడదీయవచ్చు.

కనుక " శుద్ధమైన కల్పన " యే అన్నీ ఇచ్చే " కల్పతరువు ".
" సరియైన కామ " మే అన్నీ ప్రసాదించే " కామధేనువు ".
" శాస్త్రీయ చింతన " యే చిక్కులన్నీ విప్పే " చింతామణి ".

ఇవన్నీ అందరి దగ్గరా వున్నవే ; బయట ఎక్కడో లేవు
మన అంతర్ శక్తులని మనమే ఉద్దీపనం చేసుకోవాలి.

▲ మనం ' ఇంద్రుల ' మయితే మనం మన కామం , మన కల్పన , మన చింతనల ద్వారా ఏది కావాలంటే అది సృష్టించుకోవచ్చు .

* * *

# " గురూపదేశం - ఉపనయనం "

ఒక దీపం ఇంకొక దీపాన్ని వెలిగించినట్లు,
ఒక యోగియే ఇంకొకరిని యోగి గా మలచగలడు.
మనం యోగులం గా కావాలంటే " గురూపదేశం " అన్నది తప్పనిసరి.

" ఉద్ధరేదాత్మనాత్మానం " అన్నదే " గురూపదేశం ".
" ఆనాపానసతి " శిక్షణే " గురూపదేశం ".

గురువు కేవలం మార్గం చూపిస్తాడు ;
అంతేకానీ ఎవరికీ " ఉపనయనం " చేయలేడు ;
అది ఎవరికి వారు చేసుకోవలసిన చర్యే.
" ఉప " అంటే " అదనంగా వున్న " ;
" నయనం " అంటే " కన్ను ".
కనుక,
" ఉపనయనం " అంటే " మూడోకన్ను ", " దివ్యచక్షువు " అన్నమాట.
దివ్యచక్షువు ఉత్తేజితం అయినప్పడే
" ఉపనయనం " అయినట్లు.

▲ యోగసాధన ద్వారానే కుండలినీ పూర్ణజాగృతమయి
మన ' ఉప ' నయనం తెరుచుకుంటుంది .

▲ ' ఉపనయన ' లబ్ధి ద్వారానే బ్రాహ్మణత్త్వం , ద్విజత్త్వం .

* * *

# " బ్రాహ్మణులు - ద్విజత్వం "

బ్రాహ్మణులే పూర్తి ద్విజులు.

" బ్రహ్మ జానాతి ఇతి బ్రాహ్మణః " అంటే
" బ్రహ్మజ్ఞానం ఉన్నవారే బ్రాహ్మణులు ".

అంతేకానీ,
మామూలు పుట్టుక ద్వారా ఎవ్వరూ ' బ్రాహ్మణులు ' కాజాలరు.

యోగులే " ద్విజులు ".
" ద్విజత్వం " అంటే " రెండవ పుట్టుక ".
మొదటి పుట్టుక శారీరకంగా తల్లిదండ్రుల నుంచి
పుట్టడాన్ని సూచిస్తుంది ;
మన భౌతిక కాయాన్ని సూచిస్తుంది.
రెండవ పుట్టుక మన పూర్ణాత్మను సూచిస్తుంది.

యోగసాధన ద్వారా పూర్ణాత్మతో అనుసంధానం పొందినవారే " ద్విజులు ".

జీసస్ అన్నాడు :
" నేను దేవుని కుమారుడను " అని ;
అంటే, తాను ఒకానొక దివ్యాత్మలోంచి వచ్చిన అంశాత్ముడని.
ప్రతి జీవీ ఒకానొక దివ్యాత్మ అంటే పూర్ణాత్మ యొక్క ఒకానొక అంశే !
అయితే అది తెలియని వాళ్ళు చాలామంది ;
తెలిసినవాళ్ళు బహుకొద్దిమంది.

▲ **తాము ' అంశాత్మలం ' అని తెలుసుకున్నవాళ్ళే బ్రాహ్మణులు , ద్విజులు.**

* * *

# " యజ్ఞోపవీతం "

" ఉపనయనం " అయినవాడు -
అంటే,
బ్రాహ్మణత్త్వం పొంది ద్విజుడయినవాడు -
" యజ్ఞోపవీతం " ధరిస్తాడు.

" ఉపనయనం " అంటే " దివ్యచక్షువు ".
" యజ్ఞోపవీతం " అంటే " ' యజ్ఞం ' అనబడే 'ఉపవీతం' ".
" యజ్ఞం " అంటే " పరుల సేవార్థమై చేసే కర్మ ".
స్వార్థవిరుద్ధకర్మలన్నమాట ;
లోకకళ్యాణకరమైన చేష్టలన్నమాట.

" ఉపవీతం " అంటే " బట్ట ", " నూలుప్రోగు ".
" ఉపనయనం అయినవాడు యజ్ఞోపవీతం ధరిస్తాడు " -
అంటే, " దివ్యచక్షువు అన్న దానిని సంపాదించుకున్న యోగి
ఇంక తన సహచరుల ఆత్మజ్ఞానాభివృద్ధికి
తన సర్వశక్తియుక్తులతో తోడ్పడతాడు " అని అర్థం.

" జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం " -
అన్నాడు గీతాకారుడు.
జ్ఞానమనే అగ్నిలో అశుభకర్మలు దగ్ధమైన తరువాత ఇక
మిగిలివుండే శుభ, నిస్వార్థపూరక కర్మలే ' యజ్ఞం '.

▲ అందుకే , జీసస్ ఆదేశించాడు-
" నీ సహచరులనూ నీలాగే ప్రేమించు " అని ;
అంటే " యజ్ఞోపవీతధారణ చేయి " అని అన్నమాట .

* * *

# " నిత్యాగ్నిహోత్రుడు "

బ్రాహ్మణుడికి " నిత్యాగ్నిహోత్రం " కర్తవ్యం.

" బ్రాహ్మణు " డంటే " దివ్యచక్షువును సంపాదించుకున్న యోగి " ;
" బ్రహ్మజ్ఞానం కలిగినవాడు " అన్నమాట.

ఒక పరమగురువు యొక్క కర్తవ్యమేమిటి ?
" నిత్యాగ్నిహోత్రం " !
" అగ్నిహోత్ర " మంటే " అగ్నిని ప్రజ్వలింపచేయడం ".
" నిత్యాగ్నిహోత్రు " డంటే -
"ఎప్పడూ అగ్నిని ప్రజ్వలింపచేస్తూ వుండేవాడన్న"మాట.
జ్ఞాన వెలుతురుని ఇరవై నాలుగు గంటలూ విరజిమ్ముతున్నవాడన్నమాట.

' అగ్ని ' అంటే ' జ్ఞానాగ్ని '
అంటే, ' తులసీదళం ' లోని మొదటి ఆకు :
అంటే, ' ఉద్ధరేదాత్మనాత్మానం ' అన్నమాట.
' అగ్ని ' అంటే ' యోగాగ్ని ' కూడా.
అంటే ' తులసీదళం ' లోని రెండవ ఆకు.
అంటే, ' నిరంతర ఆనాపానసతి-విపస్సన యోగసాధన ' అన్నమాట.

ఒకానొక యోగి, తాను ' యోగి ' అయిన తరువాత కూడా,
తన సాధనలో నిరవరతంగా నిమగ్నుడై వుంటాడు.
తన ' దీపం ' తగ్గకుండా ఎప్పడూ చూసుకుంటూ వుంటాడు.
అదే సమయంలో ఇతరుల ' దీపాలు ' కూడా దేదీప్యమానంగా
వెలగడానికి ఎప్పడూ కృషి చేస్తూనే ఉంటాడు.

▲ ప్రతి యోగీ నిత్యాగ్నిహోత్రుడే .

* * *

“ సంధ్య ” అంటే “ మధ్యలో ఉండే సమయం ” అని ;
అది పగలూ కాదు, రాత్రీ కాదు; రాత్రీ కాదు, పగలూ కాదు.
సంధ్యా సమయం “ మార్పు ” సమయం కూడా ;
పగలు పోయి రాత్రి వచ్చే సమయం ; రాత్రి పోయి పగలు వచ్చే సమయం.

ప్రకృతి ఎల్లవేళల్లోనూ అత్యంత రమణీయం అయినా, సంధ్యాసమయాల్లో మటుకు
దాని రమణీయత ప్రత్యేకంగా అద్భుతం.
సంధ్యాసమయానికి గల ప్రత్యేకతలో నిమగ్నం కావడమే, తన్మయతను చెందటమే
“ సంధ్యావందనం చేయడం ” అంటే.
“ వందనం ” అంటే “ సగౌరవంగా గుర్తించడం ”.

“ సంధ్యా సమయం ” ఎన్నో ఆధ్యాత్మిక జ్ఞాన పాఠాలను నేర్పిస్తుంది-
ఉదాహరణకు :
“ అన్నీ ఎప్పుడూ మారుతూ ఉంటాయి ” అని ; “ ఏదీ ఎప్పుడూ స్థిరంగా ఉండదు ” అని ;
“ మార్పును ఆపగోరడం అసంభవం, అవాంఛనీయం ” అని.
" everything is transient " - అన్నదే మౌలిక బుద్ధ సూత్రం.

“ సంధ్యావందనం చేయడం ” అంటే, “ ప్రకృతి మనకు నిరంతరం నేర్పించే
ఆధ్యాత్మికపాఠాలను సగౌరవంగా గుర్తించి పాటించడం ” అన్నమాట.
ప్రకృతిలో తాదాత్మ్యం చెంది ఆ రమణీయతను ఆస్వాదించినప్పుడు
మనలో విశ్వశక్తి (cosmic energy) ద్విగుణీకృతం అవుతుంది.

▲ **కనుక , విధిగా ‘ సంధ్యావందనం ’ ఆచరించాలి .
తద్వారా కావలసిన రోజువారీ జ్ఞానాన్నీ , ఆనందాన్నీ, శక్తినీ మనం
సమీకరించుకుంటాం .**

* * *

# " అంశాత్మ - పూర్ణాత్మ "

మనం " అంశా " త్మలం.
అంటే ' ఋషిపుత్రులం ' ;
' క్రింద ' వున్న ఆత్మలం.

" అంశాత్మ " అంటే
' సత్యలోకాలలో ' అంటే ' మహాకారణలోకాలలో ' వున్న
" ఒకానొక ' పూర్ణాత్మ ' యొక్క ఒకానొక అంశ " మనం అన్నమాట.

ఎప్పుడైతే మనం పూర్తిగా పరిణితి చెందుతామో,
అప్పుడు మనం కూడా ఆ నిర్వాణ లోకాలను చేరుతాం.
అప్పుడు మనం కూడా మనలో నుంచి నూతన అంశాత్మలను సృష్టి చేస్తాం ;
అంటే, మనమూ ' సృష్టికర్త ' పదవి చేబట్టుతామన్నమాట.

▲ " ధ్యానం లో పరాకాష్ట " అంటే మన పూర్ణాత్మతో
పూర్తి అనుసంధానం కలిగి వుండడం .
▲ " పూర్ణాత్మ " అంటే " ద్వా సుపర్ణా " అనే ఋగ్వేద వాక్యాలలో
వున్న ' రెండవ పక్షి ' అంటే పైన వుండే పక్షి అన్నమాట .

* * *

# " మానస పుత్రులు "

ఎప్పుడైతే మనం కూడా
పూర్ణాత్మ స్థితికి చేరగలమో, చేరుతామో,
అప్పుడు మనం కూడా
మనలో నుంచి అంశలను వేరుగా ఏర్పరచగలం ;
వీరే " మానసపుత్రులు ".

అప్పుడు మనం కూడా
వాళ్ళను ' క్రింద ' వున్న కారణలోకాలకు పంపి
ఒకప్రక్క మన స్వంత పనులను మనం చూసుకుంటూనే
మరోప్రక్క వారి బాగోగులను కూడా చూసుకుంటూ ఉండడం జరుగుతుంది.

వీరు కూడా యథావిధిగా
" జనన-మరణ చక్రం " లో చేరి పాఠాలన్నీ నేర్చుకోవలసిందే.
ఎవరి స్వేచ్ఛ ప్రకారం వారు విహరిస్తూ వుంటారు ;
పురోగమిస్తూ వుంటారు.

▲ **మనం పూర్ణాత్మలంగా మారిన తర్వాతే మన స్వంత మానస పుత్రులను సృష్టించడం సాధ్యమవుతుంది .**
▲ **ప్రతి పూర్ణాత్మా ఒక ' బ్రహ్మ ' ; అందుకే మానసపుత్రులు " బ్రహ్మ మానస పుత్రులు " .**

* * *

# " చావు, నిద్ర, ధ్యానం "

" చావు " . . . " నిద్ర " . . . " ధ్యానం " -
ఇవన్నీ కూడా ఒక్క లాంటివే !

ఇవన్నీ కూడా
మన స్థూలశరీరాన్ని మనం వదిలే చర్యలే-
శాశ్వతంగానో, అశాశ్వతంగానో, పూర్తిగానో, కొద్దిగానో !
తెలిసో, తెలియకో !

" చావు " లో మనం శాశ్వతంగా శరీరాన్ని వదిలివేస్తాం.
" నిద్ర " లో మనకు తెలియకుండా శరీరం నుండి బయటకు
వచ్చి కొన్ని గంటల తరువాత తెలియకుండానే తిరిగి శరీరప్రవేశం చేస్తాం.
" ధ్యానం యొక్క పరాకాష్ట " లో మనం పూర్తి ఎరుక తో శరీరం వదలి
సూక్ష్మదేహ యాత్రల తరువాత పూర్తి జ్ఞానంతో
తిరిగి స్థూలదేహ ప్రవేశం చేస్తాం.

- ధ్యానం వలన మన నిద్రావస్థలో చేసే యాత్రలు
  ఎక్కువగా జ్ఞాపకం వుంటాయి ; అంతేకాక
  ఆ యాత్రలు ఎక్కువ ఉపయోగకారిగా కూడా వుంటాయి .
- ధ్యానం ద్వారా మరణాంతర జీవితం గురించి మనకు పూర్తిగా
  అర్థం అవుతుంది .

* * *

" నిద్రావస్థ "
భౌతిక కాయానికి
ఎంతైనా అవసరం.

ఆ స్థితిలో
మనం స్థూలశరీరం వదలి సూక్ష్మశరీరంతో
ఎన్నో ఇతర లోకాలలో తిరుగుతాం.
ఎంతో మందితో కలుస్తాం.
ఎన్నో ప్రయోగాలు చేస్తాం.
భూత భవిష్యత్ కాలాలను పరిశోధిస్తాం.

నిద్రావస్థలో మన శరీరం వదలి అనుభవాలు
పొందిన తరువాత శరీరంలోకి తిరిగి వచ్చినప్పుడు కూడా
కొన్ని అనుభవాలు కొంతైనా, అవకతవకగానైనా జ్ఞాపకముంటాయి ;
ఆ జ్ఞాపకాలనే " స్వప్నాలు " అని అంటాం.

అమూల్యమైన నిద్రావస్థలో మనం -

▲ క్రొత్త విషయాలను తెలుసుకుంటాం .
▲ క్రొత్త శక్తిని సంతరించుకుంటాం .
▲ భౌతిక శరీరానికి అతి అవసరమైన విశ్రాంతిని చేకూరుస్తాం .
▲ భౌతిక జీవితంలోని సమస్యలకు పరిష్కారమార్గాలు సులభంగా తెలుసుకుంటూ వుంటాం .
▲ భౌతికంగా తీరని కోరికలను కూడా హాయిగా సూక్ష్మలోకాలలో తీర్చుకుంటూ వుంటాం .

* * *

“ భోగి ” + “ రోగి ” = “ భ్రోగి ” !
“ భ్రోగి ” అంటే “ భోగం, రోగం రెండూ ఉన్నవాడు ”.
ఆధ్యాత్మిక జ్ఞానం, మరి సరియైన జీవనసరళి - అన్నవి తెలియని వాళ్ళే ‘ భ్రోగులు ’.
ప్రాపంచికంగా నూటికి 99.99% మానవులు రోగాలనూ, భోగాలనూ
సరిసమానంగా “ రాత్రి - పగలు ” గా అనుభవిస్తూంటారు - “ భ్రోగులు ” అయినవాళ్ళు.
ఈ “ భ్రోగులు ” - “ రోగాలు రావడం ప్రకృతి సహజం ” అనుకుంటారు ;
వారికి “ నిత్య భోగత్వం ” గురించి తెలియదు.

“ భోగి ” + “ యోగి ” = “ భ్యోగి ” !
“ భ్యోగి ” అంటే “ భోగం, యోగం రెండూ ఉన్నవాడు ”.
ఆధ్యాత్మిక విజ్ఞానులై, సరియైన జీవన సరళి లో ఉన్నవారే “ భ్యోగులు ”.
నిజానికి భోగమే అందరూ వాంఛించేది, అదే అందరి గమ్యమూనూ.
కానీ నూటికి 99.99 % నిత్య భోగులుగా వుండే మార్గం కానలేరు.
యోగం ద్వారానే సర్వరోగాలూ పోతాయి;
రోగాలంటే శారీరకమైనవీ, మానసికమైనవీ, అన్నీ.
“ యోగం ” అంటే “ అనుసంధానం ”.
“ పూర్ణాత్మతో తాదాత్మ్యం ”, “ చుట్టూ వున్న ప్రకృతితో అనుసంధానం ” అన్నమాట.
“ నేను వేరే, మిగతావి వేరే ” అనే భావన ఉన్నప్పుడు,
“ మిగతా వాళ్ళను అణగద్రొక్కితేనే నేను బాగుంటాను ” అన్న
భావనలున్నప్పుడు, ఆ విధంగానే జీవించినప్పుడు - మరి రోగాలు తప్పకుండా వచ్చి తీరుతాయి.
యోగం ద్వారానే అలాంటి అజ్ఞానపు భావనలు అనుభవపూర్వకంగా తొలగిపోతాయి.
అప్పుడు ఇక మిగిలేది నిత్యభోగమే.

▲ యోగీశ్వరుడే భోగేశ్వరుడు .

▲ నిత్యభోగులు కాదలచుకున్నవారు విధిగా యోగం నేర్వవలసిందే .

* * *

# " గతం - అవగతం - విగతం "

" గతం " అంటే, మన " భూత స్థితి ",
పుట్టినప్పటి నుంచి ప్రస్తుతం వరకు చేసిన కార్యకలాపాల చిట్టా.
ఇంకా వెనక్కి పోతే వెనకటి జన్మల గాధలు కూడా !
" అవగతం " అంటే, " అర్థం కావడం ".
" అవ " అంటే " వెనక్కి రావడం " అని కూడా ;
ఉదాహరణకు పదాలు ' అవరోహణం ', ' అవతారం '.
' వెనక్కి రావం ' అంటే, ' రివర్స్ గేర్ వేయడం ' అన్నమాట.
గతాన్ని ' రివర్స్ గేర్ ' లో పరిలోకించినప్పడే
ఆ గతం పూర్తిగా ' అవగతం ' అయి ఇక ' విగతం ' అవుతుంది.
" విగతం " అంటే " మాయమైపోవడం " ;
' గతం ' అన్నది ' అవగతం ' అయి ' విగతం ' అయినప్పడే వర్తమానం అన్నది
భవిష్యత్తుకు బంగారుబాట కాగలదు.
గతం అన్నది పూర్తిగా అవగతం కాకపోతే,
ఆ గతమే పదే పదే మరి పునరావృతమవుతూ ఉంటుంది ;
చేసిన తప్పలు మళ్ళీ మళ్ళీ చేస్తూనే ఉండటం జరుగుతూ ఉంటుంది ;
మన జీవితం చర్విత చర్వమవుతూనే ఉంటుంది.
కనుక, ఎప్పడూ ' ఫార్వర్డ్ గేర్ల ' లోనే కాకుండా
అప్పడప్పడూ ' రివర్స్ గేర్ ' లో కూడా జీవించాలి !
అంటే, ప్రతి రోజూ కొంత సమయాన్ని " ఊరికే
కళ్ళు మూసుకుని శ్వాసను గమనిస్తూ కూర్చోవడానికి " కేటాయించాలి.
అప్పడు గతంలోని ప్రతి సన్నివేశం మొదట మన ' మనోఫలకం ' లోనూ,
తరువాత మన ' దివ్యచక్షువు ' లోనూ, పునః పునః ప్రత్యక్షమయి సంపూర్ణంగా
అర్థమవుతూ ఉంటుంది.
అర్థమయినదంతా ' విగతం ' అవుతూ, తుడిచివేయబడుతూ ఉంటుంది.
పూర్ణంగా తుడిచివేయబడని గతం పదే పదే వర్తమానం లోకి వచ్చి పునః పునః పీడిస్తూ ఉంటుంది.

▲ ధ్యానంలో ఉండడమే ' రివర్స్‌గేర్ ' లో సమయం కేటాయించడమంటే.

▲ అప్పుడే గతం అవగతమై విగతం అవుతుంది .

# " అప్పో దీపో భవ "

బుద్ధుడు
తన జీవితంలో చివరిగా
తన ప్రియతమ అనుచరుడు,
మరి శిష్యుడు అయిన ఆనందుడికిచ్చిన సందేశం ఇది :

> " ఓ ఆనందా ! నీకు నీవే దిక్కువి కా !
> ఇతరుల మీద ఎప్పడూ ఆధారపడవద్దు ;
> నీ ముక్తిని నువ్వే శ్రద్ధతో సంపాదించుకో ! "

" అప్పో దీపో భవ " అంటే
" నీకు నీవే దిక్కువి కా " అని.
అంటే,
" Be A Light Unto Yourself " అని.

| | | |
|---|---|---|
| అప్పో | = | నీకు నీవే ; |
| దీపో | = | దీపమువి, దిక్కువి ; |
| భవ | = | అవు. |

- ▲ ' నీకు నీవే దిక్కువి కా ' అన్నదే పరమసత్యం .
- ▲ ' తులసీదళ ' పాఠకులందరకూ ఇదే ప్రథమ , మరి అంతిమ సందేశం - ' అప్పో దీపో భవ ' అని .

* * *

# " నా దారి ఎడారి . . . "

" నా పేరు బికారి . . నా దారి ఎడారి . .
మనసున్న చోట మజిలీ . .  కాదన్న చాలు బదిలీ "

(1) " తోటకు తోబుట్టువును, ఏటికి నే బిడ్డను ;
పాట నాకు సరి జోడు . . పక్షి నాకు తోడు.
విసుగు రాదు, ఖుషీ పోదు, వేసట లేనే లేదు ;
అసలు నా మరో పేరు ' ఆనందవిహారి ' ".

(2) " మేలుకుని, కలలు కని, మేఘాల మేడపై
మెరుపు తీగలాంటి నా ప్రేయసి నూహించుకుని,
ఇంద్రధనసు పల్లకీ నెక్కి కలుసుకోవాలని . .
ఆకాశవీథిలో పయనించు బాటసారి. "

(3) " కూటికి నే పేదను, గుణములలో పెద్దను ;
సంకల్పమే నాకు ధనం, సాహసమే నాకు బలం ;
ఏనాటికో ఈ గరీబు కాకపోదు నవాబు,
అంతవరకు నేనొక నిరంతర సంచారి.. "

- పాలగుమ్మి పద్మరాజు -
[ శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్ (1973)]

అద్భుతమైన పాట ఇది !
ఆధ్యాత్మిక జ్ఞానం, ఆత్మ వికాసం మొత్తం నిండి వుంది ఈ పాటలో !

" నా దారి ఎడారి " అంటే " బయటంతా శూన్యం " అన్నమాట.

* * *

" నా పేరు బికారి " అంటే " లోపలంతా శూన్యం " అన్నమాట.
ఈ అవగాహనలో ఎప్పుడూ స్థితమయి ఉన్నవాడే ' జ్ఞాని '
అతనికొక ప్రత్యేక స్థానం అంటూ ఏదీ లేదు.
అన్ని స్థానాలూ అతనివే; అన్ని స్థానాలూ అతని కోసమే.
మనసైన చోట మజిలీ చేస్తూ వుంటాడు.
ప్రయోజనం తీరగానే బదిలీ అవుతూ వుంటాడు.

(1) " తోట " అంటే " వృక్ష సామ్రాజ్యం (plant kingdom) "
" తోటకు తోబుట్టువును " అంటే,
" చెట్లు చేమలే సహయాత్రికులుగా " ఉన్నవాడన్నమాట.
" ఏరు " అనేది " ఖనిజ ధాతువుల సామ్రాజ్యా (mineral kingdom) " న్ని
సూచిస్తుంది.

" ఏటికి నే బిడ్డను " అంటే, " ఆ ఖనిజధాతువుల నుండి నేను
వచ్చానన్న సంగతి తెలుసుకున్నవాడ " ని అర్థం.
" పాట నాకు సరిజోడు " అంటే తన గానమే, తనకు తోడని,
" తనకు తానే తోడు " అని ;
వేరే మనుష్యుల సాంగత్యమే అవసరం లేని వాడని.

" పక్షి " అన్నది " జంతు సామ్రాజ్యా (animal kingdom) " న్ని గుర్తు చేస్తుంది.
" పక్షి నాకు తోడు " అంటే " జంతువులతో చక్కగా సహజీవనం చేస్తున్నవాడు " అని అర్థం.

ఈ విధంగా ప్రకృతి జీవరాసులతో కలిసి మెలసి వుంటాడు కనుక
జ్ఞానికి ఎప్పుడూ విసుగు రాదు;
అతడు సదా ఖుషీగా వుంటాడు;
అతడు అలసట అనేదే ఎప్పుడూ ఎరుగని వాడు -
అందుకే అతను " ఆనందవిహారి ".

(2) " మేలుకుని కలలు కని " అంటే ధ్యానం లో
సూక్ష్మశరీర యాత్ర (astral travels) లు చేయడం.
" మేఘాల మేడలో " అంటే " పైనున్న లోకాలలో (ఊర్ధ్వలోకాలలో) " వున్న
" మెరుపు తీగ లాంటి నా ప్రేయసి " అంటే మిరుమిట్లు గొలిపే,
అత్యంత ప్రియాతిప్రియమైన సర్వశక్తివంతమైన
తన " పూర్ణాత్మ (overself) " అన్నమాట !
" ఊహించుకుని " అంటే " ముందుగా సిద్ధాంతపరంగా తెలుసుకోవడం ".

" ఇంద్రధనస్సు పల్లకి " అంటే, " గురువును పల్లకీగా చేసుకుని " అన్నమాట.
' ఇంద్రధనస్సు ' లో ఏడు రంగులు వుంటాయి ; అంటే ఓ గురువు
అయినవాడు, ఓ ఆత్మజ్ఞాని అయినవాడు తన ఏడు శరీరాలను
క్రియాశీలం చేసుకోవడాన్నే ఆ పోలిక సూచిస్తుంది.

" ఎక్కి " అంటే " ఆ యోగి సహాయం తో " -
" కలుసుకోవాలని " అంటే " పూర్ణాత్మతో అనుసంధానం ఏర్పరచుకోవాలని ".
" ఆకాశవీధిలో పయనించు బాటసారి " అంటే
" విశ్వసూక్ష్మలోకా(astral worlds)ల యాత్రికుడు కావడం " అన్నమాట ;
గురూపదేశం పొంది ధ్యాన ప్రక్రియ ద్వారా పూర్ణాత్మ జ్ఞానం పొంది
ఊర్ధ్వలోకాలలో యానం చేసే యోగి అతడు అని.

(3) అతను ' కూటికి పేద ' అయినా గుణాలన్నింటినీ సంతరించుకున్నవాడు.
సంకల్పశక్తి అతని ' ధనం ' ; సాహసమే అతని ' బలం '.

" గరీబు " అంటే " ' క్రింద ' వున్న ఆత్మ " ;
" నవాబు " అంటే పూర్ణాత్మ లేక సహ విధాత (co-creator)

" ఏనాటికో . . . కాకపోడు " అంటే,
తాను కూడా ఎప్పటికైనా ఆ పూర్ణాత్మ స్థాయికి చేరుకోగలననీ,

సహవిధాతగా కాగలననీ తెలుసుకున్నవాడు.

ప్రతి చిన్న పిల్లవాడూ పెరిగి సహజంగా పెద్ద అయినట్లే,

ప్రతి మొక్కా పెరిగి వృక్షమైనట్లే,

తాను కూడా ఆ విధంగా ఎప్పటికైనా, ఎలాగైనా ' బ్రహ్మర్షి ' గా

తప్పక అవుతానని ఎరిగినవాడు.

" అంతవరకు " అంటే " నవాబు అయ్యేంతవరకు ",

అంటే, పూర్ణాత్మ స్థాయికి ఎదిగేంతవరకు,

" నిరంతర సంచారి " అంటే ' నిరంతరం సంచరిస్తూ ',

' అందరికీ బోధిస్తూ, అందరినీ ఉత్తేజపరుస్తూ వుంటాడు ' అని.

ఎప్పుడూ లోపలి శూన్యత నూ, బయటి శూన్యత నూ

మరిచి పోనివాడు . . .

▲ అతడే ' ఆనంద విహారి ' !

▲ అతడే ' ఆకాశవీధిలో పయనించే బాటసారి ' !

▲ అతడే కాబోయే ' నవాబు ' !

▲ అతడే ' తథాగతుడు ' !

* * *

# నాస్తిక మూర్ఖ అభిప్రాయాలు, మరి వాటికి సంబంధించిన ఆధ్యాత్మిక వాస్తవాలు

| నాస్తిక మూర్ఖ అభిప్రాయాలు | ఆధ్యాత్మిక వాస్తవాలు |
| --- | --- |
| 1. ఈ భౌతిక శరీరమే ' నేను '. | 1. భౌతిక శరీరం ' నేను ' కాదు ; ఈ భౌతిక శరీరం అనేది మన ఏడు శరీరాలలో కేవలం ఒకటి మాత్రమే. |
| 2. ' నేను ' కు ప్రారంభం దేహం యొక్క పుట్టుక; నేనుకు అంతం దేహం యొక్క చావు. | 2. భౌతిక శరీరం పుట్టుక పూర్వము చనిపోయిన తరువాత కూడా ' నేను ' ఉంది, ఉంటుంది. |
| 3. వస్తువుల ఉనికి, సంఘటనలు జరగడం మొదలైనవి అన్నీ కేవలం యాధాలాపమే, యాదృచ్ఛికమే. | 3. ఏదీ యాధాలాపంగా జరగదు ; ప్రతీదీ స్వంత కోరికల ప్రకారమే జరుగుతుంది. |
| 4. కంటికి కనిపించే ఈ భౌతిక విశ్వం మాత్రమే ఉన్నది ; కంటికి కనపడనిది ఏమీ లేదు. | 4. అనంతమైన పౌనఃపున్యాలతో ఎన్నో విశ్వాలున్నాయి ; కంటికి కనిపించే ఈ భౌతిక విశ్వం వాటిలో కేవలం ఒకటి మాత్రమే. |

| | |
|---|---|
| 5. ఈ ప్రపంచంలో ' జీవం ఉన్నవి ', ' జీవం లేనివి ' అని రెండు రకాలున్నాయి. | 5. ' జీవం లేనిది ' అంటూ ఏదీ లేదు ; పరమాణువు నుంచి గోళాల వరకు ప్రతీదీ - శక్తి, చైతన్యం, జ్ఞానం అనే మూడింటి కలయికల శకలాలే. |
| 6. ఈ జీవితానికి నిర్దిష్టమైన పరమార్థం (specific goal) అంటూ ఏదీ లేదు ; బ్రతకడం అన్నది బ్రతకడం కోసమే. | 6. శక్తి, చైతన్యం, జ్ఞానం అనబడే ఈ మూడింటి, శకలాల కలయికకు ఒక పరమార్థం, ప్రణాళిక, లక్ష్యం ఉన్నాయి ; ప్రతి ఒక్కరూ ఇక్కడ ఉన్నది - ఆనందించేందుకూ, పరిశోధించేందుకూ, ఎదిగేందుకూ. |

ఇక మూర్ఖ ఆస్తికులూ, మిడిమిడి ఆధ్యాత్మిక జ్ఞానం కలవారూ చెప్పే కొన్ని తప్పుడు భావాల గురించీ, అనే విషయాలపై ఆధ్యాత్మిక విజ్ఞానం చెప్పే వాస్తవాల గురించీ చూద్దాం.

## ఆస్తిక మూర్ఖ అభిప్రాయాలు, మరి వాటికి సంబంధించిన ఆధ్యాత్మిక వాస్తవాలు

| ఆస్తిక మూర్ఖ అభిప్రాయాలు | ఆధ్యాత్మిక వాస్తవాలు |
| --- | --- |
| 1. ' దేవుడు ' స్వర్గంలో ఎక్కడో ఉన్నాడు ; మనం అయనను పూజించాలి ; మోక్షం కోసం అయనకు మనల్ని మనం సమర్పించుకోవాలి. | 1. ' చైతన్య ' మే మూలాధారం ; అంచేత చైతన్యజన్యులమైన మనమంతా దేవుళ్లమే, ప్రతి వస్తువూ దేవుడే. ఈ యదార్థాన్ని మనం గుర్తించాలి ; తద్వారా ఎదగాలి ; అదే ' మోక్షం ' ; |
| 2. ' దేవుడు ' మన విధినీ, కర్మనూ, నిర్ణయిస్తాడు ; అయన చెప్పిందే మనకు జరుగుతుంది. | 2. ' విధి ' స్థిరమైనది కాదు. మన నమ్మకాలు (beliefs), ఆలోచనలు (thoughts) , ఎన్నికలు (choices) మొదలైన వాటి ద్వారా మన విధిని మనవే ఎప్పటికప్పుడు ఏర్పరచుకుంటున్నాం: |
| 3. మనం పూర్తిగా మన గురించి మనం మరచిపోవాలి ; ఇతరులకు సాయం చేసేందుకే బ్రతకాలి. | 3. ప్రతి వ్యక్తి తనకు తాను మాత్రమే సాయం చేసుకోగలడు ; అలా, తమకు తాము సాయం చేసుకోవాలనుకున్న వారికి జ్ఞానాన్ని తెలియచేయడమే, మనం చేయగలిగింది. మనం ఇతరులకు ఉదాహరణలుగా మాత్రమే ఉండగలం ; అంతేకానీ, వారి జీవితాలను ఉద్ధరించలేం. |

| | |
|---|---|
| 4. మనం మన భావోద్రేకాలనూ, కోరికలనూ అణచిపెట్టి మోక్షాన్ని పొందేందుకు దేహాన్ని 'ఇబ్బంది' పెట్టాలి. | 4. దేనినీ అణచి పెట్టకూడదు ; మనం ఇక్కడ ఉన్నది మనల్ని మనం వ్యక్తపరచుకునేందుకే. భౌతిక శరీరాన్ని ఎప్పడూ బాధించకూడదు ; ఎప్పడూ మధ్యేమార్గాన్నే పాటించాలి. |
| 5. బాధలనేవి దేవుడిచ్చినవి; వాటిని మనం భరించాల్సిందే. | 5. తప్పడు నమ్మకాలూ, తప్పడు పద్ధతుల ఆచరణవల్ల మనమే మన బాధలను సృష్టించుకుంటున్నాం. |
| 6. ' మోక్షం ' అంటే జీవాత్మ, పరమాత్మల ' ఐక్యతే', అంటే వ్యక్తి, దేవుడు కలవటమే. | 6. ' మోక్షం ' అంటే, ' మన విధికి మనమే కర్తలం ' అనే మౌలిక సూత్రాన్ని తెలుసుకోవడం. జీవాత్మ ప్రత్యేకత ఎప్పడూ అవిచ్ఛిన్నంగా ఉంటుంది, అంటే, ఏ ' పరమాత్మ ' లోనూ ఏ జీవాత్మా ' ఐక్యం ' కాదు. |

# " బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం, కర్నూలు "

మౌలికమైన ఆధ్యాత్మిక విజ్ఞానం గురించి ప్రజలందరికీ తెలియజేసేందుకూ, మరి
ధ్యానం, సూక్ష్మశరీర యాత్రల ద్వారా అతీంద్రియ శక్తులను
సంపాదించుకుని భూత, భవిష్యత్, వర్తమానాలను అందరూ తెలుసుకునేందుకూ
" కర్నూలు బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం " ప్రధానంగా నెలకొల్పబడింది.

ఇది కర్నూలు పట్టణంలో
హంద్రీ నదీ తీరాన ప్రశాంతమైన వాతావరణంలో వుంది.

" బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం " అన్న దానిని ఈ ప్రదేశంలో నెలకొల్పడానికి కారణం
ఈ పిరమిడ్ ఆవరణంలో సుమారు 300 సంవత్సరాల నుంచీ
" సమీర్‌బాబా " అనే ఓ మహాయోగి సమాధి స్థితిలో తన ' కాస్మిక్ శరీరం ' తో
వుండి ధ్యానం చేసేవారందరికీ సహకరిస్తూ వుండడమే.

అసలు ' పిరమిడ్ ' ఆకారంలోనే ఒక గొప్పతనం వుంది.
భూమ్యాకర్షణ శక్తి మరి ప్రకృతిలోని విశ్వశక్తి (cosmic energy) - ఈ రెండూ
కలసి ఏర్పడిన ప్రత్యేక పిరమిడ్ శక్తి, మన యొక్క నాడీ మండలం పైన, కణ వ్యవస్థ
మొదలైన శరీర భాగాలపైన ఎంతో ప్రభావం చూపుతుంది.

' పిరమిడ్ 'లో ధ్యానం చేయడం వల్ల ఏకాగ్రత కుదిరి
ధ్యానంలో నిమగ్నం కావడం విశేషంగా సులభతరమవుతుంది ;
కుండలినీ జాగరణ త్వరితంగా జరుగుతుంది.

ప్రతి పిరమిడ్ శిఖరాగ్రంలోనూ విధిగా ఓ శుద్ధమైన స్ఫటికం వుండాలి.
ఈ పిరమిడ్‌లో కూడా సుమారు రెండు వందల సంవత్సరాల నాటి
లింకాగార స్ఫటికం ఒకటి అమర్చబడింది ;
దాని నుంచి వెలువడే కిరణాలు మనిషి స్వస్థతకు ఎంతో తోడ్పడుతాయి.
ఈ స్ఫటికం మంత్రాలయ శ్రీ రాఘవేంద్ర స్వామి వారిచే ప్రత్యేకంగా శుద్ధి
చేయబడింది.

శ్రీ రాఘవేంద్ర స్వామి వారు మరొక సూక్ష్మ స్ఫటికం *(ASTRAL CRYSTAL)* కూడా పిరమిడ్‌కు ఇవ్వడం జరిగింది.
" **N.G.** ప్రకాష్ " అనే పిరమిడ్ ధ్యాని ధ్యానంలో ఆయన దగ్గరకు స్వయంగా వెళ్ళి ఆ స్ఫటికాన్ని తీసుకుని తిరిగి వచ్చి పిరమిడ్‌లో అమర్చడం జరిగింది.
అంతేకాక, బుద్ధ మహాత్ముడు కూడా కొన్ని సూక్ష్మస్ఫటికాలను ప్రత్యేకంగా అమర్చారు.

" బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం"లో ధ్యానం చేయడం వల్ల లావు తగ్గించుకోవచ్చు ; ఆస్త్మా, మైగ్రెయిన్ తలనొప్పి, జలుబు, రక్తపోటు, గుండెనొప్పి మొదలైన బాధల నుండి విముక్తి పొందవచ్చు.
' పిరమిడ్ ' లో వుంచిన మంచి నీరు త్రాగడం వల్ల శరీరంలో రోగ నిరోధక శక్తి, ఆరోగ్యం మరింతగా పెరుగుతాయి.

మన దేశం లోనే అరుదైన ఈ " బుద్ధా పిరమిడ్ ధ్యానం " మీ అందరికీ అందుబాటులో వుంది. దీనిని ఉపయోగించుకుని ముక్తులవ్వగలరు.

- సుభాష్ పత్రి

జూలై, 1995
కర్నూలు

# " పిరమిడ్ ధ్యాన కేంద్రాల ఆశయాలు "

1. ఆధ్యాత్మిక శాస్త్ర విజ్ఞానం (spiritual science) లో కనిపెట్టిన సత్యాలను సమస్త ప్రజలకూ తెలియజేయడం.

2. అన్ని పట్టణాలలోనూ " పిరమిడ్ ధ్యాన కేంద్రాల " ను స్థాపించి ప్రజలకు ధ్యానంలోనూ, సూక్ష్మదేహ యాత్రల (Astral Travel) లోనూ ప్రశిక్షణ యివ్వడం.

3. పునర్జన్మ, కర్మ సిద్ధాంతం, శాశ్వత జీవనం సూక్ష్మలోకాలు, మరణాంతర జీవితం, ఆకాశ రికార్డులు, అతీంద్రియ శక్తులు - మొదలైన అంశాలను గురించి వాస్తవాలను అందరికీ తెలియజేయడం, వాటి గురించి ప్రత్యేకంగా ఎవరి శక్తి మేరకు వాళ్ళు ప్రయోగాలు చేయడం.

4. విశ్వప్రేమ, శాంతి, సోదరభావం, నిర్భయత్వం, స్వేచ్ఛగా ఆలోచించడం - మొదలైన సందేశాలను ప్రజా బాహుళ్యంలో విస్తృతంగా ప్రచారం చేయడం.

5. అందరిలోనూ దివ్యచైతన్యా (divine consciousness)న్ని పెంచడం.

6. ప్రపంచవ్యాప్తంగా ఆధ్యాత్మిక రంగంలో ఇంతవరకూ వెలువడిన, మరి ప్రస్తుతం వెలువడుతూన్న పుస్తకాలనూ, పత్రికలనూ సేకరించి సంపూర్ణ ఆధ్యాత్మిక గ్రంథాలయాలను అన్ని పట్టణాలలోనూ విరివిగా స్థాపించడం.

* * *

## " ధ్యానం చేయండి ! "

### " ధ్యానం అంటే ? "

' ధ్యానం ' అంటే ' ప్రార్థన ' కాదు !
' ధ్యానం ' అంటే ' స్తోత్రం ' కాదు !
' ధ్యానం ' అంటే ' నామస్మరణం ' కాదు !
' ధ్యానం ' అంటే ' మంత్రజపం ' కాదు !
' ధ్యానం ' అంటే ' శ్వాస మీద ధ్యాస ' !
' శ్వాస మీద ధ్యాసే ' బుద్ధ ప్రభోధిత ' ఆనాపానసతి ' !

### " ధ్యానం వల్ల లాభాలు "

ధ్యాన సాధన ద్వారానే రోగాలన్నీ పోతాయి.
ధ్యాన సాధన ద్వారా జ్ఞాపకశక్తి పెరుగుతుంది.
ధ్యాన సాధన ద్వారానే మనఃశాంతి లభిస్తుంది.
ధ్యాన సాధన ద్వారానే ఆత్మస్థైర్యం కలుగుతుంది.
ధ్యాన సాధన ద్వారానే దివ్యచక్షువు ఉత్తేజితమవుతుంది.
ధ్యాన సాధన ద్వారానే మనమే " గురువు " లుగా మారుతాం.
ధ్యాన సాధన ద్వారానే మనమే దైవ స్వరూపాలమని తెలుసుకుంటాం.

### " సత్యం "

మన జన్మను మనమే ఎన్నుకుని వచ్చాం.
ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి !
ఒకరు ఇంకొకరిని ఎప్పుడూ ఉద్ధరించలేరు !
సృష్టిలో కోటానుకోట్ల లోకాలున్నాయి.
మనం ఈ లోకం లో కేవలం " యాత్రికులం " మాత్రమే.

## " చావు "

' చనిపోవడం ' అంటే శరీరాన్ని వదలడమే !

' చనిపోవడం ' అంటే మన చుట్టూ వున్న ప్రపంచాన్ని మార్చడమే !

' చనిపోవడం ' అంటే మరో నూతన ప్రపంచం చేరడమే !

## " కర్మ సిద్ధాంతం "

ఎవరి కర్మను వారే అనుభవించాలి.

మన చెడ్డే మనకు చెడు చేస్తుంది.

మన మంచే మనకు మంచి చేస్తుంది.

## " జ్ఞానం "

అందరి దగ్గర నుంచీ అన్నీ ఎప్పుడూ నేర్చుకుంటూ వుండాలి.

సమయం క్షణమైనా వృధా ఎప్పుడూ చెయ్యరాదు.

శక్తి అణుమాత్రమైనా వృధా ఎప్పుడూ చెయ్యరాదు.

ఈ వర్తమాన జన్మనే ఆఖరి భూలోక జన్మగా చేసుకోవాలి.

**- సుభాష్ పత్రి**

* * *